# ఇందువచ్చు పాత్రలు.

ధర్మరాజు
భీముఁడు
అర్జునుఁడు — పాండవులు.
నకులుఁడు
సహదేవుఁడు

ఉపపాండవులు—పాండవుల పుత్త్రులు.

ధృష్టద్యుమ్నుఁడు—ద్రౌపదీదేవి అన్న.

కృష్ణుఁడు
బలరాముఁడు — యాదవులు.
సాత్యకి

దుర్యోధనుఁడు—కురురాజు

సంజయుఁడు
కృపాచార్యుఁడు — కౌరవులు.
కృతవర్మ
అశ్వత్థామ

ఘాతభీరుఁడు
బపాదుఁడు — పాలికలని దొంగలు.

ని వేటకాళ్లు.

# పీఠిక.

శ్రీమనోర్థనాంతమను పేరుగల యీగ్రంథమును రచియుంచినవారు శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారు. వీరు కపిలేశ్వరపుర సంస్థాన ప్రభువులగు శ్రీరాజా వెంకట రంగయ్యప్పారావుగారికిఁ బుత్త్రులు. ఉయ్యూరు సంస్థానాధీశ్వరులగు శ్రీరాజా రంగయ్యప్పారావు బహద్దరుగారికి వీరు పెంపకపుత్త్రులు. శ్రీరాజా రంగయ్యప్పారావుగారు సర్వధర్మస్వరూపులై సంస్థానవ్యవహారములు నిర్వహించి కీర్తిశేషులగు పిమ్మట వీరు బాలురగుటచే వీరి సంస్థానము కోర్టాఫ్ వార్డ్సు వారి యధీనమయ్యెను. వీరందువలన మదరాసులోని న్యూయింగ్టను పాఠశాలలో విద్యాభ్యాసమొనర్చిరి. అచ్చటనే వీరు ప్రవేశపరీక్షలోఁ గృతార్థులైరి. వీరు శాంతమూర్తులు. సుగుణసంపన్నులు. విద్యాస్వీకరణ నిశ్చలదీక్షాదక్షులగుటచే గురువులయనురాగ గౌరవములకుఁ బాత్రులైయుండిరి. మొదటినుండియు నాంధ్రభాషయందు వీరి కభిమానాదరములు హెచ్చు. అనేకాంధ్రగ్రంథములు వీరు పఠించి సాహిత్యమును సంపాదించుకొనిరి.

వీరు రచియించిన ప్రథమగ్రంథము ముద్రపడకపోవుటచే దానిపేరు వ్యాప్తిఁ జెందియుండలేదు. వీరి రెండవగ్రంథము పృథ్వీరాయాంతము. మూఁడవది మనోర్థనాంతము. అర్థ

రూపక సారస్వతములో నిదివఱకున్న గ్రంథములన్నియు సుఖాంతములే కాని కష్టాంతమగునది యొకటియు లేదని నేననుకొందును. అదియే నిజమగునెడల నీనవీనపద్ధతికి వీరే మార్గదర్శకులని చెప్పవచ్చును.

ఇరువదిసంవత్సరములవయస్సునఁ బాఠశాలలోని సహపాఠకుల ప్రోత్సాహముచే దీనినివీరు రచియించిరి. ఆపాఠశాలలోనే యాబాలకులచేతనే ప్రదర్శింపఁబడుటకు మొదట నిది యుద్దేశింపఁబడియుండెను. కాని, యంతటవీరు రాజకీయ వ్యాపారమును నేర్చుకొనుటకు మాజవీటికి రావలసినవారగుటచే మదరాసు పాఠశాలలో నీనాటకము ప్రదర్శింపఁబడి యుండలేదు. కానిమాజవీటిలోని సంస్థాననాటక శాలలోనే యిది రెండుమారులు ప్రదర్శింపఁబడెను.

బాలప్రభువులగువీరి యీనాటకమును నేనుజదివి సంతసించి దీనికినాందీప్రస్తావనలనువ్రాసితిని. వీరింకననేకసద్గ్రంథముల రచించివిద్యాపోషకులై, దైవకటాక్షమున నిరవధికైశ్వర్య యుక్తులై విశేషయశోవిరాజితులై ప్రజాపరిపాలనదక్షులై, సర్వసౌఖ్య సంపన్నులై, దీర్ఘాయుష్మంతులై యుందురుగాక !

1—1—15.
పిఠాపురము.

పానుగంటి లక్ష్మీనరసింహారావు.

శ్రీ

# దుర్యోధనాంతము.



శ్రీకరధర్మపక్షమును ♦ జేకొనిధర్మవిరోధిదుర్మదో
ద్రేకభరంబు నాశమొన ♦ రించుటకై భువిఁబుట్టినట్టి సు
శ్లోకుఁడు పార్థసారథి య ♦ శోదకుముద్దులపట్టినీలమే
ఘాకృతికృష్ణదేవుఁడు ద ♦ యామతిమీకిడుసర్వసంపదల్.

(నాందియగుపిమ్మట సూత్రధారుఁడు ప్ర॥)

సూ—నటీ !

నటి—ఇదిగోవచ్చితిని.

సూ—ఏమీ! మాటలోవచ్చితివి! అలసగమనవీరాత్రి యాశుగమనవైతివి !

నటి—ఆశుగమన నేకాదు. అధికసంతోషమున ననిల గమననుగూడఁ గాఁగలను.

సూ—నిజమే. ఎట్టి సుదిన మెంతకాలమునకుసిద్ధించినది. ఎంత కాలమునకుఁ దిరుగనిట్టి వేసములతో నిచ్చటఁ గలిసికొంటిమి!

సీ. సత్యావతారంబు • శాంతతేజోనిధి
 ప్రిభువరుండీ సంఘ • పాలకుండు
శ్రీరాజరంగయా • ప్పారావు సద్గుణ
 మణిపేటి చెల్లయాం • బావధూటి
కూరిమితోఁ బెంచు • కొన్న యీనును మొల్క
 యింతయై యింతయై • యింత పెరిగి
సద్గుణప్రసవమై • సత్కళాఫలమయి
 రామాంచితలతాభి • రామమగుచు
గీ. సత్కవిద్విజరాజవ్ర • జప్రిదత్త
 నిస్తులచ్ఛాయమయ్యె నీ • నీడక్రిందఁ
 జిరసమాశ్రితులముగానఁ • జేరినాము
 వేడుకను బాడి యిటగంతు • లాడుటకును.

నటి—వెనుకటి లోపము తీఱునట్లు మనయిష్టముకొలఁది యెన్ని తెయితక్కలాడవచ్చును. కాని యెన్నిసారు లడిగిననైన నది చెప్పితిరికారేమి?

సూ—ఆడఁబోవు నాటకము దుర్యోధనాంతమని యెఱుఁగుదువుకదా! కవినామము తెలియకుండిన నేమి?

నటి—తెలిసిన నేమి? మీరేల చెప్పఁగూడదు?

సూ—కొన్ని కారణములుండుటచేతనే మానితిని.

నటి—ఎవ్వరికి నెక్కడలేని కారణములు మనకే వచ్చెనవా? చెప్పకతప్పదు.

సూ—నీకీ వస్త్రేల ?

నటి—మీకీ వస్త్రేల యని నే నడుగలేననుకొంటిరా ? చెప్పక తీఱదు.

సూ—ఈ నాటక మగువఱ్ఱకైన నాకవీశ్వరుని నామము మన సంఘమువారికి వెల్లడింపకుండ రహస్యముగ నుంతువా ?

నటి—అటులే! చెప్పౌదు. ఊఁ.

సూ॥—

సీ. విద్యలో వినయంబు ♦ వెలసిన యాతఁడు
వల్కులో మృదులతఁ ♦ బడయునతఁడు
కలిమిలో గర్వంబు ♦ గలుగనియాతఁడు
కవితలోన నసూయఁ ♦ గననియతఁడు
చరితలో సత్యంబుఁ ♦ బొరసినయతఁడు నా
పదలోన జంకును ♦ బడనియతఁడు
ఈశు పార్థనమున ♦ నెదియుఁగోరని యాతఁ
డీవిలోగుప్తత ♦ నెనయు నతఁడు

గీ. కొంత మేడువారికినిరాజు ♦ కొంత నిడుద
వ్రాలునకురాజు నుయ్యూరు ♦ బాలరాజు
పండితులరాజు కవిరాజు ♦ భానురాంగి
కాంచుమూర్తఁడె యీ నాట ♦ కంబొనర్చె.

నటి—ఆ! ఆ! మన వేంకటాద్రి అప్పారావుగారే!

ఆహా! కర్ణములు పవిత్రములైనవికదా! ఈబాలరాజుచే నీ
సంస్థాన మెంత ధన్యమైనది!

సూ—ఆంధ్రదేశముగూడననిన నతిశయోక్తి కాదు.

గీ. కవితఁబోషించు రాజేంద్రు ♦ కాలమందుఁ
గవితసౌభాగ్యసంపత్తి ♦ గాంచుననఁగ
నట్టి ప్రభుఁడు సత్కవిగూడ ♦ నైనయపుడు
భవ్యకావ్యాభివృద్ధి చె ♦ ప్పంగఁ దరమె?

నటి—ఇట్టి సంతోషకర వార్తను నేను మనవారికిఁ
జెప్పక మానను. (పోఁబోవును.)

సూ—(నటి చేయిపట్టుకొని) ఆఁగుము. మన ప్రభువు
వారే యీ నాటక మొనర్చిరని వారికిఁ దెలిసిన యెడల
భయముచే వారు నాటకప్రదర్శనము పాడుసేయుదురేమో
యను సందేహముచే రహస్యముగ నుంచితిని. నిన్నుంచు
మంటిని.

నటి—అట్లుకాదు. ఉత్సాహముచే నటకులు మఱింత
బాగుగఁ బ్రదర్శింతురు.

సూ—నటీ! అట్లుకాదు. నేను జెప్పినమాట విను.

గీ. పరుని ధనమునకై పూచి ♦ పడఁగవచ్చు
నింటియతఁడున్న యింట వ ♦ సింపవచ్చుఁ
గాని నాటక కర్తయా ♦ కవి యెదుటను
నాటకంబాడ లేరెట్టి ♦ నటకులైన.

నటీ! ఇంక నాలస్యముసేయక శరదృతువునుగూర్చి పాడుము.

నటి—ప్రస్తుతానుభవములోనున్న వసంతర్తునుగూర్చి పాడిననేమి?

ఉ. చల్లనిచందనంబున ర • సాలఫలంబులఁగోకిలధ్వనిన్
మొల్లలబంతులన్ సరస • ఫుల్లసరోజమిళిందఝుంకృతిన్
మల్లెలదండలన్ మలయ • మందసుగంధిలమారుతంబులన్
బెల్లగునీవసంతఋతు • వేసరివేసరి వేఁగువారికిన్.

సూ—నటీ! నీవంటిపడుచుదానికీఋతువు సుఖప్రదము కావచ్చునుగాని వార్ధకమునను న్న నాకుమాత్రమిచ్చటిమెండలు, అబ్బ! అబ్బ!

(నేపథ్యమున) అబ్బ! అబ్బ!

సూ—అడుగో భూతభీరుఁడు. "అబ్బ!అబ్బ!".యనుచు రంగమునఁబ్రవేశించినాఁడు. ఇఁకఁబోవుదమురమ్ము.

(నిష్క్రమింతురు.)

ఇదిప్రస్తావన.



(శ్రీ)

# దుర్యోధనాంతము.

ప్రథమాంకము.

(Iవ రంగము.)

ద్వైపాయనహ్రదతీరము.

ప్రవేశము — భూతభీరుఁడు.

భూత — (తక్కుచుఁ దాఁగుచు నులికిపడుచువచ్చి)
బ్బబ్బ! ఈదిక్కుమాలిన దయ్యాలభయము నాకెక్కడ
ండి దాఁపురించినదోగాని, ఒంటరిగా నెప్పుడు పోవలెనన్న,
ప్రాణసంకటం తెచ్చిపెడుతుంది. మాఅన్న, మాఅయ్యా,
లికిపడి) ఈవేళ మాఅయ్య వైకరథం చక్రంక్రిందపడి నలిగి
చ్చిపోయినాఁడు. వాడిపేరెత్తితే ఎక్కడదయ్యం విన్నుపడ
తాడోఅనిభయం. అట్లా, మావాళ్ళు "నీకీపిరికితనం యెక్కడ
నుండి వచ్చిందిరా"అనితిట్టి యీభయంతీర్చడానికే చిన్నప్పటి
నుంచి, వంటలేనిచేనుకాపు. పాడుబడ్డయింటివాసం, వల్లకాటి

కావలి, మళ్ళీరానోడిమోత, ఇంకాయెన్నన్నో గొప్పపనులు చేయించి, పట్టపగలు మిట్టమధ్యాన్నము, నట్టనడురాత్రి, పోరానిచోట్లకంత వెంటబెట్టుకొని, వంటరిగాపంపిచూచారు గాని, మరేససేంలంటేను. దయ్యంఅంటే(ఉలికిపడి) వెన్ను జల్ జల్ మనటంమానలేదు. నేనుకూడ యెంతో చేసి చూచి నాను. మీసాల్దువ్వినాను. బంటుదుస్తు సంపాయించాను. కత్తిచేత్తో పట్టినాను, పదిమందిమధ్యన ధైర్యంగాతిరిగినాను, మామునలిఅవ్వమీద నడుముకట్టి కుస్తీచేసినాను. యెన్నో చేసినాను. ఏంచేస్తేనేంవంటరిగా రాత్రియింటెగడప దాటా లంటే మాత్రంకొంచెంజంకే. దీనికితగినట్లు నాకుమిక్కిలికష్ట మైన వృత్తిదాపరించింది. ఏమిచెయ్యను.(నడియగును) ఆ!ఆ! (అనిభయమందును)

[ప్రవేశము లంబపాదుఁడు]

భూత—ఓరన్నానీవా! నేనుమరేమిటో అనుకు న్నాను.

లంబ—ఓరీనన్నే దయ్యంఅనుకున్నావు. నేనేమి నీ కండ్లకు దయ్యంలాగున్నానా?

భూత—తటాలుననినుచూచి అనుకున్నారా! పోనీ దానికేంగాని యీవేళకొట్లాట యేలాగున్నది?

లంబ—అహాహా ! యేమికొట్లాట. యేమిపోట్లాట.

యేమిశ్ర త్రిపోట్లు. యేమికర్రదెబ్బలు. యేమిబాణాలు, యేమి బళ్ళెములు. యేమిమొండెములు. యేమితుండెములు. యేమి రక్తం. యేమిశబ్దం. అబ్బబ్బ! చెప్పడానికి అలవిగాని పోట్లాట యీవేళయెన్నోయుద్ధాల్లో యేమహారాజు బంట్లమన్నో చెప్పా కొని పోరులో పౌరుషంచూపించకపోయినా, పోరయిపోయిన తర్వాత చచ్చిపోయిన బంట్లదుస్తులు వస్తువులు, దోచుకొన టంలో మహాపౌరుషం చూపించినాము కానియేదియెక్కడ యిటువంటిపోరు చూడలేదు.

భూత—నీవుచెప్పాతుంటేనే నాగుండె దడదడ కొట్టు కుంటున్నది. అదిచూస్తే యేలాగుండునో?

లంబ—ఓరీ! పిరికోడా నీకెప్పుడీదయ్యాల భయం పోతుంది ఆపాడుభయంవుంటే మనవృత్తిలోపైకెక్క లేవు సుమా?

భూత—లేదురాఅన్నా! ఆదక్షిణగోగ్రహణయుద్ధం తర్వాత విరాటసైనికుడి మెడలోహారం పుటుక్కున తెంపేసరికి "హా" అనిలేచి పైనపడినాడురా! అప్పటినుంచి ఏవీనుంగదగ్గ ఆకు పోవాలన్నాగుండె గుబేల్ గుబేల్ మంటుంది. పోనీనా భయంకేంగాని, ఈవేళనీకేమైన కొంచమో, గొప్పో దొరి కిందా?

లంబ—(తనలో) నిజంచెప్పితేవీనికి భాగంపెట్టాలి.

(ప్రకాశముగా) ఏమిదొరికిందిరా ! యేమిదొరకలేదు. ఈవేళ యుద్ధం అయినంతసేపు, రథాలకిందపడకుండ యేనుగులకింద నలగకుండ, గుఱ్ఱాలలో నిరుకుకోకుండా, జనములోఁ జిక్కుకోకుండా లంబపాదుడనే నాపేరుకుతగినట్లు. అటువుకి యిటు దూకి; అటువంగి, యిటుయెగిరి, ప్రాణం కాపాడుకోవడంతోనే సరిపోయింది.

భూత—నన్నుపిరికిఅన్నావు నీవుమహాధైర్యంతో పని చేసినావు.

లంబ—సరే! మనఅయ్యను చూచినావా ?

భూత—ఆ ! చూచినాను.

లంబ—యెక్కడ ?

భూత—పాలికలనిలో.

లంబ—యేమిచేస్తూవున్నాఁడు ?

భూత—ఏమిలేదు.

లంబ—నీతో యేమైననన్నాడా ?

భూత—లేదు.

లంబ—నీవేమి అడుగలేదా ?

భూత—లేదు.

లంబ—ఎందుకుమాట్లాడి రాలేదు.

భూత—ఎందుకు మాట్లాడిరావలెను?

లంబ—విశేషంవుంటే తెలుసుకొనడానికి.

భూత—అయ్యనుజూచి నాకుభయమైనది.

లంబ—తండ్రినిచూచి భయమెందులకు ?

భూత—భూతమై దిరాట్సైనికుడివలెనే నన్నుకొట్టు
నను భీతిచేత.

లంబ—ఓరీ! నిర్భాగ్యుడా! తండ్రిచచ్చిపోయినాడా?

భూత—నేనుదగ్గఱకుబోయి చూడలేదు.

లంబ—మఱినీవు చూచినదేమిటి ?

భూత—ఏమిటా ? మనయ్యకాళ్ళు నిగడదన్ని కళ్ళు
తేలవేసి. చేతులుబారచాపి. బిఱ్ఱబిగిసి పడివుండాడు.

లంబ& భూత—హోరయ్యా! (అనికాగిలించుకొని
యేడ్తురు.)

[ప్రవేశము—భీముని వేటకాండ్లు]

1 వేట—అరే! వీళ్ళెవళ్ళో దయ్యాలకు భయపడే
వాళ్ళులాగున్నారు. కొంచెం వేడుకచాద్దామా ?

2 వేట—కానీ. (1 వేటనిష్క్రమించి తెల్లబట్టకప్పు
కొని ప్రవేశింతురు.)

భూత—(చూచివణంకుచు) ఆ! ఆ! (అనిచూపును.)

లంబ—తమ్ముడా! అధైర్యపడబాక. దయ్యాంగియ్యాం,
నాజతకిరా, మనమిద్దఱంగలసి వీళ్ళనితన్ని పంపుదాం.

భూత—హోరన్న! నాకంతగుండె నిబ్బరం లేదు.
నీవేపోయి వాళ్ళనుతరిమివేయి.

లంబ—దయ్యాలయితే నేనొకడనేపోయి తరుముదును. యెముక నూంసంవున్న మనుష్యులు వాళ్ళిద్దఱు.

1 వేఁట—మేము ఈవనదేవుళ్ళము.

2 వేఁట—మిమ్మలిని యిప్పుడే చంపుతాము.

లంబ—మీసంగతినే నెఱుఁగుదును. నాయొక్క వృత్తి దయ్యాలన్ను భూతాలను దొంగిలించడం. ఇఁక మీవట్టివేషాలకుభయపడము.

1 వేఁట—అట్లయిన నిన్నిప్పుడే చంపుతాము. (అని క్రిందపడవైచి నోరుమూయును.)

2 వేఁట—ఇఁక నిన్నుకూడ బలిచేసుకుంటాం.

భూత—దయ్యాలసాముల్లారా! నన్నిడవండి. మీకు బలికావలిస్తే, మేఁకలు, కోళ్ళు తెచ్చిపెడతాను.

2 వేఁట—(1వేఁటతో నాలోచించి)సరే! నీవుమామీఁద భక్తితో వున్నావుకాఁబట్టి, నీవుతేబొయ్యేకోళ్ళు, మేఁకలు, పుచ్చుకొని, సంతోషించి నిన్నువిడుస్తాం నీవు త్వరగాపోయి తీసికొనిరా.

భూత—అట్లాగనేసామి? దండాలుపోతా. (కొంచెము నడచి తనలో) అమ్మయ్య! ఇప్పటికి బ్రతికిపోయినాను. కోళ్లు మేఁకలు దొరికినా వీళ్ళకుతెచ్చియిస్తాను. లేకుంటే కాలికి బుద్ధిచెప్పి, పరుగూ, యింకొకదేశానికి.

1 వేఁట—ఏమి గొణుగుతున్నావు ?

భూత—పోమె. పోమె. (నిష్క్రమించును.)

1 వేఁట—వాఁడు పోయినాఁడు. నీవెవ్వరో చెప్పు.

లంబ—క—క్క—క్క.

2 వేఁట—ఓహో ! నీకు కక్కకావలెనా ?

లంబ—ప—ప్పు—ప్పు.

2 వేఁట—పప్పులుకూడ కావలెనా ? ఇవిగో పప్పలు. (అనివీపుపై నఁగొట్టును.)

లంబ—నేను కౌరవబంటునుకాను. పాండవబంటును.

1 వేఁట—ఛీ ! పాండవ సేనలో, యింతపిరికి వాళ్లున్నారురా.

లంబ—(తనలో) వీళ్ళముందు మొదట, ధైర్యంగా నటిస్తాం అప్పుడైన విడుస్తారేమో ! (ప్రకాశముగా) ఆ ! పిరికితనము మా యింటపుట్టిన ఆడుకుక్కకైన లేదు.

1 వేఁట—సరి. అదంతయెందుకు ? మాకు నీవెవ్వరో చెప్పు.

లంబ—ఏమిటీ ! మహాప్రైకివచ్చి మాట్లాడుతూవున్నావు. నాకు కోపంవస్తె యేమౌతుందనుకున్నావేమిటి ?

1 వేఁట—విస్తారము తన్నులు యెందుకు తింటావు ? నీ సంగతిచెప్పు.

లం—ఆ ! అవమర్యాదగా మాట్లాడుతావేమి ? నా

సంగతి యెరుగుదువా ?

1 వేట—ఈ నాడు నీకు చెడుదినం. (అని కొట్టం బోవును.)

లంబ—(తప్పించుకొని) నేను ధర్మరాజంత శాంతం కలోడినికాంబట్టి బ్రతికిపోయినావు. ఇంకొకసారి నామీందికి రా. నీ పని చెప్తాను.

1 వేట—ఇదిగో చెప్పు. (మరల కొట్టంబోవును.)

లంబ—(తప్పించుకొని) నీవు పెద్దమనిషివి. నేను పెద్ద మనిషిని. నాజోలికిరాకు. నీకేమి కావలో చెప్పు.

1 వేట—అట్లా దారికిరా ! మాకు దుర్యోధనరాజు దాక్కొనియున్నచోటు చూపించవలె.

లంబ—(తనలో) ఆహా ! వీళ్ళను వదలించుకునేదారి నాకు తెలిసింది. వేడుకచేస్తా. నాపేరు లంబపాదుడుగదా. (ప్రకాశముగా) ఓరీ ! పిచ్చివాళ్ళలారా! ఈమాత్రానికా, నాకు కోపము తెప్పించినారు. ఇంతే. ఇదుగోఒక్కనిమిషంలో ఐతే మీకు దుర్యోధనమహారాజొక్కండే కావలెనా మతి యింకెవ్వరయినా కావలెనా ?

1 వేట—మాకు కావలిసం దారాజొక్కడే తక్కిన వాళ్ళంతా చచ్చిపోయినారా ?

లంబ—ఏమీ నేను లేనూ.

1 వేట—ఛీ! నీకోసంకూడా వెతకవలసినంత అవ

నరమేమి వచ్చిందిమాకు.

2 వేట—అదిగాక మా చేతతన్నులు తింటానేవుంటివి. నీవు యింకా నిన్నెక్కడో యెందుకు వెతకవలె ?

లంబ—ఆ! ఆ! మర్యాదగామాట్లాడండి సరేకాని ఆరాజుగారిని యిక్కడనేచూపనా యింకెక్కడనైనా చూపనా ?

1 వేట—ఆయన యెక్కడవుంటే అక్కడేచూపు. నీయిష్టంవచ్చినకాడకి ఆరాజువస్తాడా !

లంబ—ఓహో ! ఇంతేనా ! నాసంగతియేమనుకున్నారు? ఇంద్రజాలము టక్కుటమారావిద్దెలన్ని నాకు తెలుసును. మీకుఆయన్నిచూపడమొకటే కాదు కావలిస్తే నేనిక్కడనున్నానని మీకగపడకుండా మాయమైపోతా.

2 వేట—(మెడపట్టుకొని) ఓరీ!ఏది! మాయముగా! చూస్తాం.

లంబ—అబ్బబ్బ! వదులు. (వదలించుకొని) నిమ్మళం, నిమ్మళం, ఉరికితే పొద్దుకుంకుద్దటయ్యా! మొట్టమొదట రాజును మీకుచూపించితర్వాత మాయమైపోతా!

1 వేట—తర్వాత నీ మనసొచ్చినట్లుచావు. మాకాయననుమాత్రం చూపించు.

లంబ—మంచిది ఇట్లారండి. నావెంటరండి. అదుదుగోఅటుచూడండి. (వారలుచూచుచుండగా వెనుకకొదిగి

యిద్దరివీపులపై చెరియొక చరపుచరచి పారిపోవును.)

1 వేట—అరే! అరే! తప్పించుకొనిపోయినాడురా! జిత్తులమారినక్క, (అనియిద్దరు వానివెంబడించి మరలివచ్చి)

2 వేట—సరే! మళ్ళీమనచేతిలో చిక్కడుగనకనా, పీడిసంగతిపోనీ! ఆదుర్యోధన రాజుగారు వున్నతావింకా తెలియనేలేదా ?

1 వేట—లేదురా! మనధర్మరాజుగారి ఉత్తరువు మీందయెన్నోచోట్లు వెతకినానుకాని వారిజాడయేలేదు.

2 వేట—నాకూ తెలియలేదు ఇంక కనుకొందాము రా.

1 వేట—అరుగో యెవ్వరివో మాటలు వినపడు తున్నాయి ఆపొదలో దూరి విందాము. (నిష్క్రమింతురు)

రెండవ రంగము

[ప్రవేశము—దుర్యోధనుడు సంజయుడు]

దుర్యో—(చింతాక్రాంతుడై) సంజయా! ఇట్టిదురదృష్టవంతునింకను వెనుదగిలి వచ్చుచుంటివా ? ఏమిసేయుందితనము !

ఉ. పోయెను భీష్మకుంభజుండు
పోయెను, కర్ణుడుమద్రనాథుడున్
బోయిరి, తమ్ములాప్తులును
బుత్రులుమిత్రులుసత్కృపాలుర్

పోయిరి, నైరులం బెదగ సభా
స్థలి, నైననునిట్టివానివెల్
బాయవుప్రేమమైనెటులు
ప్రస్తుతిఁ జేసెద నిన్ను సంజయా !

సంజ—రాజా! ఊరడిల్లుము. విధివిధానంబున కేమని వగచిన నేమి ప్రయోజనము.

దుర్యో—ఊరడిల్లుచు నేయున్నాను. లేక యిప్పుడేమి చేయనగు?

తే. గీ. తనదు యత్నములన్నియుఁ ♦ దగులఁ బెట్టి
పాడుదైవంబు వైరులఁ ♦ బ్రబలఁజేయ
విధివిధంబంచు [illegible]దనుమాటి ♦ వెతలకోర్చి?
యూరడిల్లకే మొనరింప ♦ నోపునరుఁడు.

పోనిమ్ము. అడ్డులేక శత్రువులు మనలఁ జేయువధములో నీవె ట్లు బ్రతుక గలిగితివి ?

సంజ—మహారాజా ! నేనునుజావవలసినదే. ఆకల్లోలంబున, రక్తసిక్తశరీరులై, పాండవవీరులెల్లరు విచ్చలవిడి వర్తింపుచుండిరి. అందు నేనుధృష్టద్యుమ్నసాత్యకులచేఁ బడఁగా, ధృష్టద్యుమ్నుండు నన్ను ఖండింపనుద్యుక్తుఁడయ్యెను.

దుర్యో—చావసిద్ధముగానున్న వారితలలు గోయుటలో నాతఁడు చాల నిపుణుఁడే. తరువాత.

సంజ—అంతఁ బ్రాణాశత్యజించి నే భగవంతుఁడలంచితి.

దుర్యో—(హేళనముగా) భగవంతుఁడు ప్రత్యక్షమయ్యెనా?

సంజ—లేదు. కానితద్భక్తుండగు వేదవ్యాసుండగపడి, వారలనివారించి నన్నునీకడ కేఁగుమనిచెప్పి యంతర్థానుండయ్యె.

దుర్యో—మేలయ్యె. మనవారింకెవ్వరయిన బ్రతికి యున్నారా?

సంజ—నేను పాలికలసిలో నున్నంతదనుక కృపాచార్యుండును కృతవర్మయు, నశ్వత్థామయుఁ బాగుగనేయున్నారు. మఱియు నేనందునుండివీడివచ్చుముందే, యుద్ధము మానుమనియు, నీవెంద్దైననగపడినఁ బట్టితెమ్మనియు, ధర్మరాజాజ్ఞఁ బంపియుండెను. కావుననాముువ్వురును బ్రతికిపోయిరనియే నానమ్మకము.

దుర్యో—బాగు, బాగు! ద్రోణపుత్రుఁడగు నశ్వత్థామ యింకనున్నాఁడా? అట్లైననామనోరథంబీడేఱుఁగాక.

సీ. ఆదిలోఁ సేనకు ♦ నధిపుఁజేయఁగ భీష్ము
డెఱిఁగించెదనునేర్చు ♦ తెఱఁగులెల్ల

నాపైనద్రోణు నా • యకుఁ జేయనన్నియా
గతులవైరులకు మే • ళ్ళతఁడొనర్చె
తరువాతఁ గర్ణుని • దండు పెద్దగఁ జేయ
శాపంబులాతని • శక్తినణఁచె
వంతశల్యునకు సై • న్యాధిపత్యమొసంగ
నల్లురమేళ్ళించి • యతఁడుచచ్చె

తే. గీ. నందఱును బాండవుల పక్ష • మైరి కాదె
ద్రోణసుతుఁడొక్కఁడే నన్నుఁ • దొంటినుండి
ప్రీతిఁ జూచెడి నతఁడుండ • భీతి లేదు
సమయమును గాంచి పగఁదీర్పఁ • జాలువాఁడ.

సంజ — రాజా! రాజా! ఏమంటివి ?

దుర్యో — నను మొదటి నుండియు విశ్వాసముతోఁ గొల్చు నశ్వత్థామ బ్రతికియుంటచే నాతని సాహాయ్యముతో భూమి నపాండవముగా నొనర్చి యాపైన నేపో మొదననుచున్నాను. మఱేమియు లేదు.

సంజ — అయ్యో! ఇది యెట్టి పూనిక ?

మ. గురుఁడున్ భీష్ముఁడు కర్ణుఁడాదిగ మహా
కోదండవిద్వాంసులున్
వరధీరానుజులొక్క నూర్గురు కరుల్
వార్వంబులున్ బెక్కు కా

ల్వురలుఁ జేరులు రాజ్యముంగలుగుచో
లోంగింపలేకుంటె వే
సరణిఁ ముప్పూర చేతఁ బాండవులపై
సాధింతువో వైరముఁ.

దుర్యో—సంజయా! నీ హేళనమున కిదియా సమయము ?

సంజ—పాపము శాంతించెడుఁగాక! రారాజా! నిన్ను నేనా, హేళనము సేయువాఁడను? నీవు తలంచినదియసాధ్యమని చెప్పుటకట్లంటిగాక.

దుర్యో—సరే! మఱి నన్నేమి సేయుమనెదవు ?

సంజ—వినుము. నీకు మేలుకోరి చెప్పెద,

క. ధర్మాత్ముఁడు దారుఁడమిత
నిర్మలగుణుఁడుం గృపావి ◆ నీతుఁడు ప్రియుఁడుఁ
మర్మవిదూర మనస్కుఁడు
ధర్మజనూజుండు బంధు ◆ తతిహితుఁడనఘా.

దుర్యో—అందుచేత నేకాఁబోలు నింతమంది బంధువులకుఁ బరలోకలాభ కారణుండయ్యె.

సంజ—అంతయు నెఱిఁగియు ననుభవించియు, నింకను బాండవుల దెతప్పనుచున్నావా? రామాయణమంతయు విన్న తరువాత సీతను దెచ్చుకొనఁ బోయినందులకు రాముని దే నేరమను చున్నావా ?

దుర్యో—అబ్బా! ఈగొడవయేల? ధర్మసుతుఁడు నీవు చెప్పిన సద్గుణములఁగలిగియే యుండనిమ్ము. ఐననా కేమి?

సంజ—ఆతనితమ్ములును నట్టివారే? మఱియు నాతని మాటనేనాఁడునుజవదాటనివారు.

దుర్యో—కానిమ్ము.

సంజ—దీనదయాళుఁడగు శ్రీకృష్ణుఁడునుగలఁడు.

దుర్యో—నేనెఱుఁగనా?

సంజ—ఎఱుఁగుదువు కావున,

తే. గీ. ఇట్టిదౌర్జన్యమునుమాని ◆ యేగి, ధర్మ
సుతునితోసఖ్యమొనరింపఁ ◆ జూచుకొనుము
కృష్ణుఁడొనగూర్చు హితమునే ◆ కీభవించి
పాండుతనయులతో సౌఖ్య ◆ ముండుమధిప.

దుర్యో—నీవింతసేపు బోధించినదాని పర్యవసాన మిదియా? చాలుఁజాలు. కౌరవేశ్వరుఁడు రాజ్యముపోయి నను నింతనీచస్థితికి వచ్చుననుకొంటివా?

సంజ—

సీ. రారాజ నీకు మే ◆ ల్గోరినాబోఁటులు
విన్నవించెడిమాట ◆ వినగదయ్య
కర్ణదుశ్శాసన ◆ గాంధారజానుజ
మర్మదుర్యోధనల్ ◆ మఱుపురుయ్య

ద్రోణగాంగేయులు ♦ తొలినుండిసంధిచే
తగునన్నవాక్యముల్ ♦ దలఁపుమయ్య
పరులచేనోడింపఁ ♦ బడినందులకునింత
పగఁబెంచియాత్మలో ♦ వగవకయ్య
తే. గీ. నొసటివ్రాలెవ్వనికి మార్పఁ ♦ బోసఁగదయ్య
గడచినవియెల్లఁ ద్రివ్వక ♦ విడువుమయ్య
ధర్మసూనునితోఁబొత్తు ♦ ధర్మమయ్య
వాంఛితంబయ్యె యాత్రింబు ♦ వదలుమయ్య.

దుర్యో—వెఱ్ఱిసంజయా ! ఒకవేళ ధర్మజు కాళ్ళపైఁ బడనేనొప్పుకొన్నను కృష్ణుఁడుపోనఁగనిచ్చునా ? ఆతఁడు భూభారహరణార్థంబై దిగిన దైవమనికదా మీరుచెప్పెదరు. నేనొకింత స్థూలశరీరుండఁ గావునఁ దనప్రియసతియగు ధరాదేవికినన్ను మోయుశ్రమము సాధ్యమైనంతత్వరలోఁ దొలగింపనే చూచుచుండును. మఱియు నన్నెవరు సహించినను భీముఁడు సహించునా ? వారందఱుట్లుండ నేనట్టిహీనమార్గమును బూనుదునా ?

చ. కురుకులమందుఁబుట్టి, పలు ♦ కోట్లజనంబులకెల్ల రాజనై
కరినగరంబునేలి యతి ♦ గౌరవధీరులగోష్ఠినుండి నూ
ర్గురుఘనులైనతమ్ములను ♦ గోల్పడి యోడినసిగ్గు లేక నేఁ
బకులనుగొల్చి కూడుదిని ♦ ప్రాణమునిల్పుకొనంగనేర్తు నే.

సంజ—మఱియేమొనర్పవలయునని నీయుద్దేశము?

దుర్యో—మొదటనేచెప్పలేదా? భూమిని నపాండవముగనొనర్ప వలయునని.

సంజ—మహారాజా! ఎట్లొనర్ప నెంచితివి? మన యోధవీరులలో నేఁబేర్కొనిన ముగ్గురుఁదప్పఁ దక్కినవారందరు నని గూలిరి. ధరణియంతయు వైరులస్వాధీన మయినది. నీవుమాత్రము వారిచేఁబడక యెందుండెదు?

దుర్యో—అదియా! నీసందేహము భయపడకుము. జలస్తంభనవిద్య నాకేర్పియుండిన విధంబీవెఱుంగుదువు. ద్వైపాయనం బనంబఱగు నీ హ్రదంబున నావిద్య మూలమున నీటమునింగియుండెద. నాయునికి నరుండెవ్వఁడును నెఱుఁగఁ జాలఁడు. నీవింతలోనేఁగి ద్రోణాత్మజుం దోడ్కొనిరమ్ము. నేనాతనితో సంభాషింపవలయు.

సంజ—దేవరాజ్ఞ శిరమునవహించెదకాని కురురాజా! పెద్దవాఁడను నావిన్నపము—

దుర్యో—నీ వెన్నినుడివినను నామనోనిశ్చయమును మాన్పఁజాలవు. అదిగో! ఎవరోవచ్చుచున్న సడియగుచున్నది. నేనిదే నీరంబులఁ జొచ్చెదను.

సంజ—నీతండ్రి ధృతరాష్ట్రునకేమని చెప్పుమని యెదు.

దుర్యో—ఏమనియా?

చ. దురమున నీకుమారకులు

తొంబదియెన్మిది మందియేరికై?

మరణము నొందిరా జనుఁడు

మానసమందునఁ గ్రాలుకోపముక్

బోరికసిప్రోవఁ బొందునృప

పుత్రులఁ గేటడఁగించుదాఁక మా

ప్కరుఁడును యోధనుండు నినుఁ

గాంచఁగఁ జాలఁడటంచుఁ బల్కుమీ.

(అని చెంతనున్న హ్రదంబున దుముకును.)

సంజ—అక్కటా! సర్వధారుణీతలంబునకును రారాజై చెలంగినవాఁడు తుద కెట్టిస్థితికివచ్చెను! నేనెంత చెప్పఁబోయినను వినక పాండవులపై నతిమాత్సర్యము వహించు కర్ణాదుల దుర్బోధనలీమూర్ఖుఁడు మనంబున నెంతగాఢముగాఁ బాటించుచున్నాఁడు! స్వభావమున మూర్ఖుఁడైనను మొదటినుండియు దుష్టసహవాసం బలవడకుండినయెడల దుర్యోధనుఁడు సద్గతికి వచ్చియుండునేమో? శకునికర్ణదుశ్శాసనులారా! రణమునఁ గూలియిప్పుడేలోకమున నున్నారలో కాని మీబోధనలు కౌరవేశ్వరు నెంతకుఁ దెచ్చినవో యిప్పుడైనఁ దెలిసినదా?

సీ. మాయజూదమున ధ ♦ ర్మజు గెల్చితి నటంచు
గర్వించినఫలంబుఁ ♦ గాంచుశకుని!
పాంచాలిదేవిని ♦ బరిభవించినయట్టి
దుష్కార్యమిటు తెచ్చె ♦ దుస్ససేన!
బవరంబునను గెల్తుఁ ♦ బాండుసూనులనెల్ల
నంటివీవేమయ్యె ♦ నరయుకర్ణ!
కురురాజు మదినింకఁ ♦ గ్రోధంబుఁ బెంచిన
సద్గతియిది కురు ♦ సభ్యులార!
తే. గీ. వినుఁడి! మీవాక్యములనవి ♦ వేకుఁడగుచుఁ
బాండుసూనులనీతఁడు ♦ పరిభవించి
శౌరినలయించి, ధర్మజుఁ ♦ బోరిమిమ్ము
నమ్మి కౌరవకులమెల్ల ♦ వమ్ముఁ జేసె—

ఏనను వారందఱనననేల! ఈసుయోధనుబుద్ధి వక్రింబుగా కుండినయెడల వారెన్నినుడివినను లెక్కకువచ్చియుండునా? అక్కటా! ఈబంధువిరోధంబుననైన పోరెందఱకెన్ని కష్టములఁదెచ్చి పెట్టినది.

సీ. సుతులుచావఁగ నేడ్చి ♦ బ్రతుకు తెర్వును లేక
మూలనాకలిమూల్గు ♦ ముసలివారు
మగలుపోరునఁజావ ♦ పగచిబిడ్డలఁజూచి
యొడరువున కేడ్చు ♦ నాఁడువారు

క్రొత్తగాఁ బెండ్లాడి ♦ కూరిమిఁ గాంతుఁడనిఁ జావ
నురుదీనగతి నేడ్చు ♦ యువతిగణము
తల్లి ముందుగఁ జేన ♦ తండ్రి పోర నశింప
ఫీతిల్లి కడు ♦ రోఁజు పిన్నవారు
తే. గీ. మిత్రుని చావునఁ జింతించు ♦ మిత్రచయము
నధిపుఁడసిఁగూల విలపించు ♦ నాశ్రితాళి
యిట్టి ఘోరములెన్నియో ♦ యొనఁగుచుండ
విజయ సంరావమున నేరు ♦ వినరుగాక
యన్నియును జూచు నీశ్వరుం ♦ డరయ లేఁడొ
నంగరాంతంబునను రేఁగు ♦ సంకులంబు

హా! జరిగినదానికి నేనెంత చింతించిన నేమి ప్రయోజనము ? కానున్నది కాకమానదు. (ముందుఁజూచి) అహో! అల్లదె పాండు సైనికు లింకను గసిదీరక వైరులకై వెదకుచు నీదెస వచ్చుచున్నారు. (చెంత నడియాడును) ఎవరక్కడ ?

[ తెఱలో ]

1 ఎవరైన నీకేల ?
కృత—2మా పని వేరు నీ పని వేరు. నీవు నీదారిఁ బొమ్ము.
అశ్వ—ఎవ్వరా! చెప్పెద.

మ. తమగుర్వంచు నొకింత యెంచక యు
వాత్సల్యంబుమైఁ బోరిలోఁ

దము సన్నించిన దెల్లనన్నుఱచి
సత్యానీకము నందోర్వ్యతే
క, మహాత్ముండగు ద్రోణుఁ గల్లనుడి సం
గ్రామంబు మాన్పించి దు
ష్టమతిన్ జంపిన నారి కాలుఁడను
నశ్వత్థామనే వచ్చెదన్.

(కత్తిఁ ద్రిప్పుచు నశ్వత్థామ ప్రవేశించును. వెంటనే కృపాచార్యుండును, కృతవర్మయుఁ బ్రవేశింతురు.)

కృపా—కుమారా! శాంతింపుము. శాంతింపుము. మహామహాఘను లెందఱో పోయిరి. మనము మువ్వుర మేమి చేయఁగలము?

కృత—(సంజయునిఁ జూడఁగని) ఓహో! సంజయా! నీవా నమ్ము హెచ్చరించినది? వైరులని తలంచియట్లు పరుషోత్తరం బొసంగితిని. క్షమింతువుగాక!

సంజ—అయ్యా! నేఁ జెన్నెరో కర్ణకఠోరంబులగు వార్తలు వినిన యీ చెవులకు మిత్రవాక్యంబు లెట్టివైనను హృదయరంజకము లే! అశ్వత్థామా! ఏలయింకను గోపోద్దీపితుండవై చెలంగెదు? కృతవర్మా! రాజునకు మనము నలుగురమే మిగిలియున్నాము.

కృత—రారాజింకను జీవితుఁడై యున్నాఁడా?

అశ్వ—ఎందున్నాఁడు!

చ. తనకొఱకెందఱెందఱో, యు
దగ్రసమీక వివేక మానసుల్
తనువులు గోలుపోవ, సమి
తంబగు సేనలు నుగ్గుగాఁగఁబో
రున ఘనులెల్లఁ జావక,
విరోధులు సర్వఁగ మృత్యుభీతిపా
టెను; తనుగొల్చు మాకును
మఱిం దలలెత్తగ సిగ్గుఁగల్గగాఁ.

కృత—అశ్వత్థామా! అశ్వత్థామా! ఏలయీయనవసరపుమాటలు? సంజయా! కురురాజెందున్నాఁడు?

సంజ—ఈహ్రదంబున.

కృపా&కృత—ఏమీ? యీహ్రదంబుననా?

అశ్వ—ఈరీతినైనఁదనువుఁ దొరంగ ధైర్యము నవలంబించెఁగదా?

సంజ—(కృతవర్మ కృపాచార్యులతో) ఔను. హ్రదమునసే సజీవుఁడై యున్నాఁడు. (అశ్వత్థామతో) ద్రోణపుత్రా! రారాజునీవనుకొనినంత పిఱికివాఁడు కాఁడుసుమా! నిజమారయక నిష్ఠురములేల పల్కెదవు.

కృపా—(అశ్వత్థామతో)కుమారా! కోపము శాంతింపుము. సంజయా! దయయుంచి కురురాజుసంగతి వివరించి చెప్పుము.

సంజ—మీరు వినినట్లు కృష్ణద్వైపాయనుచే రక్షింపఁ
బడియుండురాఁ దనువంతను బలుగాయములు గలిగి రక్త
సిక్తుండై కడుబడలి దీనవదనుండై యున్న కౌరవేశ్వరుంగాంచి,
వ్యాకులమానసుండనై యాతనితో సంభాషించితిని. అతఁడు
మనవారందఱు సంగరనిహతులైనందులకు మిగులఁ జింతించె.
అంత మీరు మువ్వురు సర్వమారణకారణంబునుండి వెలువడి
యుసురులు దక్కించుకొన్నది. ... ...

అశ్వ—దక్కించుకొనుట ? వీరిద్దఱు నను దోడి తేకున్న
నా ప్రాణము సంతోషపూర్వకముగ సంగరస్థలి కప్పగించి
యుందును.

కృపా—కుమారా ! నిన్ను బతిమాలుకొనెద. కురు
రాజు గతి విననిమ్ము.

సంజ—ఆతనితో విన్నవించి, యేమి సేయనుంటివని
యడుగ మన మువ్వురమైనను మిగిలియుంటిమని సంతసించి
యశ్వత్థామను జూడవలెననియు, నాతఁడు తోడుగఁ బాండ
వులపైఁ బగదీర్పనుంటిననియుఁ బలికె.

అశ్వ—ఏమీ, అట్లనియెనా ! నే నాతని దప్పుగా
నెంచితిని.

సంజ—నేనందుండి వారించి ధర్మరాజుతో సంధి సేయు
మని చెప్పితి కాని నామాట లాలకింపక తన జలస్తంభన విద్య

మూలమున మిమ్ము మువ్వురను గాంచుదనుక నీద్వైపాయన
హ్రదంబునందుండెదనని తన్నీరంబులఁ బ్రవేశించె. చూచి
తివా? ద్రోణనందనా! నీవేదియు నెఱుంగకయే రారాజును
భీరువని తూలనాడితివి.

కృత—(అశ్వత్థామతో) వింటివా! ధర్మరాజునితో సఖ్య
మొనర్చుమని మేము నీతో చెప్పినట్లే రారాజుతో సంజ
యుఁడును జెప్పియున్నాఁడు.

అశ్వ—(సంజయునితో) సంజయా! రారాజు నిప్పుడే
హ్రదంబునుండి వెలికిఁబిలువుము. నాకోపోద్రేకమున నాడిన
వాక్యములకై క్షమింపవేఁడి తరువాతఁ గార్యము నాలో
చించెదము.

కృ—(అపవారించి సంజయునితో) సంజయా! ధర్మ
రాజుతో సంధియిప్పుడైనను సమకూర్చుటమేలని నేనునుగృత
వర్మయుఁదలంచి యశ్వత్థామనుగూడ సంధులకు సమ్మతింపఁ
జేయ యత్నించితిమి.

సంజ—(అపవారించి) అతని వాక్యధోరణిఁజూడ మీ
యత్నంబులు సఫలము లగునట్లు లేదే.

కృపా—(అపవారించి) లేదు. తనతండ్రిఁ జంపిరను
కోపమునఁ బాండవులపైఁ బోరెదననియు లేక జీవంబులఁ
ద్యజించెదననియు నరుచున్నాఁడు. ఏమి చేయుదము?

సంజ—(అపవారించి) దుర్యోధన మహారాజును నట్టే



పెంకితనమును బూనియున్నాఁడు. ఇప్పుడే వీరిద్దఱకును సంఘాషణ జరిగెనా కార్యము చెడును. కావున మన మీతని నోడంబఱచువఱకు దుర్యోధనునతఁడు దర్శింపరాదు.

కృపా—(అపవారించి) నేను నట్లే తలంచెద. కాని యీతఁడొప్పునా ?

సంజ—(అపవారించి) ఇంకొకసారి చెప్పిచూదము, నేనును చెప్పెద.

అశ్వ—ఏదియో మీరు రహస్యమాడుచున్నారు ? సంధివచనములు కావుగదా !

కృపా—ఔనవియే. వినుము. కోపము—

అశ్వ—నే వినను. కృపాచార్యా ! నీవాదంబు సకారణంబుగాదు.

సీ. రారాజయిన వాని ♦ వైరికాళ్ళకుమ్రొక్క-
మనిచెప్ప మనబోంట్ల ♦ కర్హమొక్కొ ?
చెప్పిననాతండు ♦ చేరిదాయాదులఁ
దప్పఁగావఁగ వేఁడ ♦ నొప్పునొక్కొ ?
ఒప్పెఁబో పాండవుల్ ♦ యుద్ధమందోడిన
వారితో సంధికి ♦ వలతురొక్కొ ?
చేసినవారల ♦ చేసన్నలమెలంగఁ
గౌరవేశునికట్టి ♦ కర్త్రమొక్కొ ?

తే. గీ. ధారయుఁగఁ బోరిలోఁగూలి • వీరలోక
మందుటయె మేలనెడుమాట • యన్నృతమొకొ?
యధిపునకయి పోర మనకు • నర్హమొకొ?
మంచిగతి చెప్పఁ డివియేటి • మాటలొకొ?

సంజ—అశ్వత్థామా! నీమాటలు విన్నకొలందినాకు విచారంబడఁగి యచ్చెరువయ్యెడు మొదట కురురాజుపైనంత కోపముతో మాటాడి యింతలోనే యాతని యభిమానము గాపాడెదవేల?

అశ్వ—పాలికలనువీడి పలాయన మొందెనని విని, మృత్యుభీతినో, రాజ్యకాంక్షనో, యట్లొనర్చెనని తలంచి. "సింహకిశోరంబనుచు నాదరింప నక్క కూనయయ్యెరా" యను భ్రమంబున మనంబెత్తియ నట్లంటి. కాని పాండవులపై నింకను వైరభావమున నున్నాఁడని నీవలన వినినతోడనే నా దురభిప్రాయంబునకై నన్ను నిందించుకొని యెప్పటియట్ల రారాజునకై నా పితృహంతకులతోఁ బోర నుద్యుక్తుండనైనాఁడ.

సంజ—మేలు! మేలు! మన దుర్యోధనరాజున్నంత దనుక మనమాతనిసంసేవ నుండవలసినదే. కాని పాండవులపై నీకంతకోపమేల కలుగవలయును? నిజమెంచిచూడ నీ కలహంబు వారిచెయిదము కాదని తోచుచుండుటలేదా!

## మత్తకోకిలవృత్తములు.

నీతిమంతులు పాండుపుత్త్రుల • నింద్యవర్తను లేల యీ
రీతి వారలఁ గోడిపొత్తువ • రిగ్రహింపవు పాడియే !

అశ్వ—నీతిమార్గగులౌటఁ గల్లల • నీచులట్టుల పల్కి ధ
ర్మేతరంబుగ నొందఁబోలి • యుండి రెంతయు నీరులై

సంజ—ఘోరసంగరమందు పోరెడి • క్రోధబుద్ధి మెలంగుచో
వారిచేష్టల నెంచి యప్పటి • వర్తనన్నిరసించెదే.

కృత—నేర మొక్కటి యెంచి పల్కెదు • నీదు తండ్రి నిజంపఁగా
వేగ తప్పులఁ జెప్పి పాండవ • వీరులెందునఁ జేసినన్.

అశ్వ—నిగ్గఁజాలక భీష్ము ముందున • నిట్ శిఖండిని దెచ్చి యే
సిగ్గు లేక యె నంపశయ్యను • జేర్చి రాతని జూడ మే.

కృప—మొగ్గరంబున విల్లు వీడెన • మోఘవాక్యన భీష్ముఁడా
యొగ్గు పాండుకుమారులందున • నేలమోపఁగఁ జూఁచెదే.

అశ్వ—సోమదత్తిని జంపి రేగతి? • సైంధవుఁ వధ సేయుచో
నేమి చేసిరి ? కృష్ణుఁడుండఁగ • నింతయున్ సమకూడెగా

సంజ—ఆమహాత్ముఁడు వారిచర్యల • నాత్మ మెచ్చుటగాదె? సు
క్షేమముం జెడినా నిగర్హణ • నేయఁగా మము బోట్లకున్

అశ్వ—మెచ్చి కృష్ణుఁడు బావలంచును • మేలు వారికిఁ జేయుని
మ్మచ్చుగింతు నె కౌరవేశుని • హీనమానవు సేయఁగాఁ

సంజ—దెచ్చెరేఁ హితమూనిధర్మజు ♦ చెంతనుండియునింకఁ బై
సచ్చరిత్రుకుఁడై మెలంగుచు ♦ సౌఖ్యముండుట స్థైర్యమే.

అశ్వ—వారిపంచలఁ గౌరవేశుఁడు ♦ వర్తిలంగదు సౌఖ్యమే
పోరనోడినవానివారలు ♦ పోటుమాటలఁ జంపరే

కృపా—కారణంబిసుమంత లేకయె ♦ క్రౌర్యభావముఁ బూనదీ
వారియర్మ మునకౌరవేశుని ♦ యాగడంబిది కాదొకో.

సంజ—ఉత్సాహావృత్తము.

వినుముద్రోణపుత్త్రసంధి ♦ వేగసేయకుండినన్
మనముకౌరవేశ్వరుండు ♦ మడిసియదిగొచూడుమీ
వనమృగాదు లడ్డులేక ♦ వచ్చితినెడి మృతజనం
బుననుదొరలుచుండుమతల ♦ పోయెనెంతనీచమో

అశ్వ—మృతుండడనౌదుననిభయపడెదననుకొంటివా.
సంజయా!

సంజ—కాదు. కాదు. అటు తుచ్ఛజంతువులచే నెవ
రును సందలేకుండుగతి దుర్యోధనునకు— కాదు. కాదు.
ఆతనికళేబరమునకుఁదప్పింపుమని నిన్నుఁబ్రార్థించుచున్నాఁడ.

అశ్వ—(తలవంచియాలోచించును.)

సంజ—మఱియు నీతండ్రియగుద్రోణాచార్యులీవమీ

కము కూడదని యెంత చెప్పినో నీవెఱుఁగవా? వేయేల? యుద్ధమునకై దుర్యోధనునిఁ గర్ణుఁ డొకదినము పురికొల్పఁ బోవ నీవే కోపమునఁ గర్ణునిపైఁ గత్తిఁ దూసి యుండలేదా? అట్టి నీవే యిప్పుడు మనయుగ్రతతోడ దుర్యోధనుని మఱియొక సారి పాండవులపైఁ బురికొల్పి స్వర్గమున నున్న మీ తండ్రి కనిష్టము నొనర్చెదవా?

అశ్వ—ఇంతకుఁ దెచ్చిన పాండవులను మా తండ్రి మాత్రము క్షమించునా?

సంజ—అయ్యో! తన్ను జయించు రీతి పాండవులకుఁ జెప్పిన మీతండ్రియా క్షమింపకుండును.

కృత—మనము పాండవులతోఁ బోరి వీరత్వమున మడిసినను గురురాజున కెట్టిలాభమగును? అదియుఁగాక నీవు పోయిన నీముసలి తల్లిని నెవఁడు పోషించును? తండ్రిచావున కై పగఁదీర్చుపూనిక తల్లినిఁ బోషించుటలో నేల యుండఁ గూడదు?

అశ్వ—(కొంతదనుక నాలోచించి) ఆహా! తండ్రీ! ధనురాచార్యవర్యా! నిన్నుఁ జంపినందులకై ప్రతిక్రియ నొనర్పనున్న నన్ను వీర లనేకయుక్తియుక్తంబులగు వాక్యంబులచేఁ బాండవుల స్నేహమే రారాజునకు మేలనుచున్నారు.

నే నొడంబడుచున్నందులకు క్షమించుము.

తే. గీ. ఆది నిను నన్నుఁ బోషించి • నట్టి ప్రభువు
కొఱకు ననుగన్న తల్లి నీ • కూర్మి తన్వి
కొఱకు నీ పాంతకుల పొత్తుఁ • గోరుచుంటిఁ
గాని నాకొఱ కెంతయుఁ • గాదుకాదు.

(ప్రకాశముగా) పెద్దలు మీరనిన వాక్యంబుల కియ్యకొన కుండువాడనా? ఒకవేళ దుర్యోధనరాజే యొప్పకుండిన నే నేమి చేయఁగలవాఁడను. అతఁడు పట్టినపట్టు విడువాఁడు గాఁడే?

కృపా—మనము చెప్పిన నేలయొప్పఁడు? ఇప్పుడు దుర్బోధలనుఁ జేయుటకుఁ గర్ణాదులున్నారా?

అశ్వ—ఒకవేళ నొప్పకున్న నేమిచేయుదు?

కృపా—నీతండ్రిమాటలును మీ మాటలును కుంటచే నింతకువచ్చెను. ఇంకనువినకున్నఁ గానున్నదిపూర్తి గాఁగలదు.

[తెరలో కలకలము]

కృత—పాండుసేన లిదెనకుఁ వచ్చినవి. మన మిం దుండరాదు.

అశ్వ—కృపాచార్యా! రారాజు సంధి కొప్పకున్న నాకరవాలమున కీవచ్చువారిలోఁ గొందఱ నాహుతులఁ జేయ సెలవిచ్చెదవా ?

కృపా—అశ్వత్థామా! అశ్వత్థామా! దయయుంచి రమ్ము.

(నిష్క్రమింతురు.)



# ప్రథమాంకము.

## ౧వ రంగము.

(దుర్యోధనుండు ప్రవేశించును.)

దుర్యో — మంజరి ద్విపద —

ఎట్టెట్టు! తుదకెల్ల నీరీతి యయ్యెఁ
గా! నాదు బాల్యంపుఁ గసిదీర్పఁ బోయి
చేసినయత్నముల్ చివరకు నన్ని
నిర్మూలమొనరించె ; నిజముగా నాదు
వాంఛలే కులమెల్ల వమ్ముగాఁ జేసె
నాకొఱకై కాదె నాతమ్ములెంత
దోశ్శక్తిమంతులు దునుమాడఁబడిరి
నాకొఱకై కాదె నయతత్త్వవిదుఁడు
భీష్ముండు మాతాత పితరునికంటె
గురువౌట వంద్యుఁడౌ కుంభసంభవుఁడు
నధికవీరుఁడు మిత్రుఁడైన కర్ణుఁడు
మఱియెందఱో గొప్ప మానవేశ్వరులు
రణభూమినున్నారు రక్తపిండములై

ఇంక లెక్కకుమీఱి యెన్నొ గుట్టలుగఁ
బడియున్న బంటులఁ బలుకంగనేల ?
అక్కటా యిదియంత నవసినేఁ బంచి
యీయకుండుటఁగదా యే తెంచె ; నయ్యొ
నాపేరుఁదలఁచి యీనాడు వృద్ధులును,
విధవలు, బాలుడు, వెతలనెన్నెన్నొ
కడుపుచు నేడ్తురో కడు దిక్కుమాలి
ఛీ! యిట్టి పాపుఁడ సిగ్గింత లేక
ఘనులైనయనుచరుల్ కదనమందెల్లఁ
జావఁగ, నొక్కండ శత్రుంబుపైని
బడకుండ నింకను బ్రతికియున్నాఁడ
ఆ ! యేల ! నావారందఱు చనిరె !
కృపుఁడు ద్రోణసుతుండు కృతవర్మలేరె !
వారలివ్వాడైకదా వచ్చి పాండవుల
నింకనైనను జేరి హితముండుమనుచు
బోధించిపోయిరి ; బుద్ధినూహింప
దురదృష్టమెంతటి దోశ్శక్తిమంతు
పూన్కినైనఁగదల్చి పోకార్చు ; జనుఁడు
దృఢచిత్తుఁడై యొక్క తెఱఁగునఁబోవ
దనుగడ్డనదు విధి యడ్డమైనిలిచి
చేసినయత్నముల్ చెఱుపుచునుండ

నురుశౌర్య యుతుఁడయ్యు నొక్కింతసడలి
వెనుజూచి ఛీ! యని వెతఁజెందకున్నె?
వలయుదానినిఁ జేరవడిఁ బోవుచుండి
దానికై వచ్చు నితరుల ముందురికి
యలసి యొకండాఁగ నాతనిఁద్రోచి
పడఁద్రొక్కి ముందుకుఁ బయనింతు రొరులు.
పడినవాఁడొక్కింత వఱకట్టులుండి
సేదదేఱఁగ లేచి, చెలరేఁగి యుఱుకు
మూఁకలోఁగలసి తాముందునకరిగి
యలసిపోయినవారి నణఁగఁ ద్రొక్కుచును
దనవంతు మఱివచ్చి ధరఁగూలుదాఁక
వలయుదానిఁ జేర వాంఛించిపోవు
ధరనెప్పుడును సంఘధర్మమిట్లుండు
నొక్కఁడొక్కొకసారి యుర్విపై నలరి
యొరునకు తావిచ్చి యొయిదొల్గిపోవు.
కావునమావారు కలినోడిపోవు
కతన, నీమున్నుగానుకను దీనులటుల
ధర్మజునకు నన్ను దాసుఁగమ్మనిరి.
వారలన్నట్లు సేవతీర్చుతునొక్కొ!
ఏమేమి? కురునృపుం డేనాఁడునైన
వెడఁగుదాయాదుల వేఁడఁ బోయెడునె?

ఘనులగు ద్రోణగంగజేసి ఖలులపై కెత్తు
వసుధపై విభునీతి వమ్ముగుఁగాక !
ధరణివణంకి భూధరము లెగిరిన
చంద్రసూర్యులు దివిఁ జరియింపకున్న
తారలు రాలినఁ దనురక్తమంత
నవనిఁబారినను నేనాపాండు సుతుల
తో, హీనుఁడటుల, పొత్తున కొప్పఁగలనే ?
మఱి వీలుఁజూచి యామత్తమానసుల
మట్టించి యమలోక మహిమకంపెదను.

(సడియగును.)

ఇదిగో వచ్చెదరిట కెవ్వరోకాని
గెల్పునగర్వించి గేలిసేసెదరు
పాండు మూఁకలలోని బంట్లాదురేమొ ?
కసితీర్చుకొనుతఱి కనఁబడుదాఁక
ఖలులైనవైరులు గాంచకుండుటకు
హ్రదమునందున డాఁగి యాసతోనుందు.

(హ్రదములోఁ బ్రవేశించును.)



శ్రీ

# దుర్యోధనాంతము.

## ద్వితీయాంశము.



### ప్రథమరంగము.

[ప్రవేశము—1 వేటకాఁడు, ఉపపాండవులు, నకుల సహదేవులు]

నకు—వనవీరా! కురురా జెందున్నాఁడు?

1 వేఁట—మహాత్మా! అదుగో! ఆ మడుఁగులో నున్నాఁడు.

సహ—ఆమడుఁగునా?

1 వేట—ఔను. సహదే. రాజా! రాజుగారును, వారితో నెవ్వరో నలుగురును, మాట్లాడుచుండఁగా, నే నాపొదలో దాఁగొని చూచినాను.

1 ఉప—ఆనలుగు రెవ్వరై యుందురో?

నకు—ఎవ్వరననేల ? యుద్ధమున నుసురులుదక్కించు
కొనిన కృపాచార్యాది రథకత్రియంబును, నాల్గవవాఁడుమాత్రి
వారివలెనే బ్రతికిపోయిన మఱియొకండును నయియుండ
నోపు.

1వ వేఁట—ఒకఁడు ముసలివాఁడువలె కనఁబడెను.

2వ ఉప—నాకుఁ దెలిసినది. నాల్గవవాఁడు సంజ
యుఁడు.

1 ఉప—అయియుండనిమ్ము. కాని దుర్యోధనాశ్వ
త్థామలకు సంభాషణము జరిగెనా ?

సహా—కుమారా ! ఏల యడిగెదు ? భయపడె
దవా ?

1వ ఉప—మనకందఱకు దైవసమఁడగు ధర్మజునకై
యిన్నిదినములు పోరినవానికి నన్నియు నయినతరువాత
ప్పు డేమిభయము!

2 ఉప—నట్టి మాటలతో నేమి ప్రయోజనము ? ఆ
సరిదతీరమున కేగి దుర్యోధను హేళనముగాఁ బిలుతము
రము.

నకు—వలదు. వలదు. తావచ్చుదనుక మనము దుర్యో
ను నేమియుఁ జేయఁగూడదని యన్నగారియాజ్ఞయైనది. ఇదే

(ప్రవేశము—ధర్మరాజు, భీముఁడు, అర్జునుఁడు, శ్రీకృష్ణుఁడు! సాత్యకి, ధృష్టద్యుమ్నుఁడు)

ధర్మ—కృష్ణా! తమ్ములును కుమారులును వేఁటకానితో నిందే నిలిచియున్నారు. దుర్యోధనుఁడున్న మడుగు సమీపముననే యున్నదని తలంచెద.

అర్జు—అన్నా మఱచితిరా! ఇది యేకదా ద్వైపాయన హ్రదము.

భీము—మేలయ్యె.

కృష్ణు—ఇంకొకింత దవ్వుండినను, నీయట్టి బలశాలి నడువలేకుండునా?

ధృష్ట—మాయూర నాఁడు వారరుణోదయంబున నీరు గొనితేఱ హ్రదమునకు, ననుదినంబును నింతకంటె నెక్కువయే నడతురు. పాండవవీరులకు మాత్రము శక్తి లేకున్నదా?

అర్జు—నిజమే! మీ దేశపు సతి యొక్కతే, మా దేశపుఁ బురుషుల బలువుర వశులఁ జేసికొనును.

సాత్యకి—ధర్మజా! నడువ శ్రమగానున్నదా!

అర్జు—బావలారా! ఏమేమీ హేళనము? కృష్ణా నీవుండఁగా నెన్నెన్నియో ఘనకార్యము లొనర్చిన మా కొంతదవ్వునడచుటయే కష్టమా!

ధర్మజా—అర్జునా! బాగుగఁ బల్కితివి.

ఉ. లక్కగృహంబు నందు నన
లంబుల దాటుట, ఘోరమౌ విషం
బెక్కఁగ భీముఁడుంట ; సభ
నింతికి మానముపోక చేలముల్
పెక్కులువచ్చి చేకుఱుట;
భీకరమౌ రణమందు గెల్చుటల్
నిక్కము కృష్ణుచేఁ గలిగె
నేనొక కొంచెము నడ్వనేర్వనే.

భీము—ఔనన్నా! నిక్కువమే.

ఉ. పుట్టిననాఁట నుండియును
బోషణచేసెను దండ్రిభంగి నా
కట్టడి కౌరవుల్ మనకు
గాఱియ లెన్నొ తేఁగఁ బాపియా
నిట్టి మహానుభావు డని
కింకొక శేషము గల్గు నేను మాఱ
బట్టిన పట్టుదీఱఁ గురు
పార్థివవంశము లూడఁగొట్టమిన్.

ధర్మ—తమ్ముఁడా! శాంతింపుము. ఇంతదాఁకఁ జేసిన



బంధువధను చాలదా! పాపము. నానమేమి చేసితిను నీకేఁ డేమిప్రతి యొనర్పఁగలఁడు? అసహాయుఁడు. కృష్ణా! ముందు నకుఁ జొప్పునవా!

కృష్ణ—అభ్యంతరమేమి? కాని మీమాటలువిన నా కచ్చెరువయ్యెను. పోరాడినది నీకొఱకు. శౌర్యోద్రేకముఁ జూపి పోరినవారునీతమ్ములు, మిత్రులు, మీమీబలంబులచే మీరు గెల్పుంగొంటిరి. అనుభవించువారు మీరు. నడుమ నే నెవ్వఁడను? నొగలపైఁ గూర్చుండి, యీకోలతో మీ తమ్ముని యాజ్ఞాప్రకారమున రథ్యములఁదోలుచుంటిని. ఇంత తోడనే యుద్ధము జయించినట్లైనఁ బట్టణంబునఁగల సారథు లందఱుచేరి ముల్లోకముల జయింతురు. సరి! ధర్మరాజా! నడువుము.

సాత్య—బావా! సేవదీరినదా! రాజగుణంబులు నీ కిప్పుడు పూర్తిగనలవడుచున్నవి.

ధృష్ట—అవేవి?

సాత్య—పూర్తిగనారగించుటయు, నొక్కింత నడచిన నుస్సురని నిలచుటయు.

ధర్మ—జాగగుచున్నది. కృష్ణా! రమ్ము. (ముందునకు నడతురు.)

నకు—దుర్యోధనుఁడు దాఁగియున్న హ్రదమిదియే

2 ఉప—తా మిందు వచ్చేయుటకుఁ బూర్వమే వాని వారికిఁ బిలిచి తానొనర్చినదాని పర్యవసానముం జూప బాగని యెంచితిమి కాని చిన్నయ్య నకులుఁడు భవదాజ్ఞ యన్యంబని తెలిపి మమ్ము నివారించెను.

భీము—మేలు. కుమారా! మన గౌరవమునకుఁ దగినట్లాలోచించితివి.

కృష్ణ & అర్జు—(ఆమోదము నటింతురు)

ధర్మ—కుమారా! దుర్యోధనరాజు జెట్టివాఁడయినను నీ తండ్రి తమ్ముఁడు. వాఁడు వాఁడనుచుఁ బ్రసంగించుట తప్పు.

కృష్ణ—(1వ ఉప పాండవునిఁ బురికొల్పును.)

1వ ఉప—తండ్రీ! మాకిన్ని యిడుమలఁ దెచ్చి పెట్టిన దుష్టునిపై నింకఁ జాలి యేలపూనెదరు?

సహ—తాఁ దీసిన గోత తాఁ గూలక తప్పునా?

ధర్మ—ఏమీ! దుష్టుఁడు! వాఁడు! ఈనీచసంబోధనలన్నియు మన పెదతండ్రి కుమారునికే! పాపము. మీ యందఱిలో నొక్కఁడైన నాతని నాదరించి మాటాడరా!

భీము—ఆనాఁడు సభలో మనతో నాదుష్టుఁ డొక్క చల్లని వాక్యమునైనను బలికెనా?

ధృష్ట—ఔను. ఎలుంగెత్తి యేడ్చుచున్న వనితను బరిభవించు కూరునకుఁ జల్లని వాక్యములు నోటివెంట వచ్చునా?

కృష్ణు—(తిరిగి పురికొల్పును.)

ధర్మ—(కృష్ణునింగాంచి) ఇది బావగారి ప్రోత్సాహమా! కృష్ణా! నీ కెప్పుడును హాస్యమే!

అర్జు—బావ సతతానందస్వరూపుఁడుగదా!

కృష్ణు—ఆ—నందునిచేఁ బెంపఁబడినఁగావున, నానంద స్వరూపుఁడనయితిని. ఇఁకఁ బెద్దబావగారిమైత్రిచే వాద్దులేని దయాగుణుఁడఁగావలసియున్నాను,

ధర్మ—ఈ రెండు గుణములు నీకుఁ గ్రొత్తలా! మహాత్మ! కాని—

భీము—కాని దుష్టనిగ్రహంబుతోఁ గలిసియున్నవి.

ధర్మ—భీమా! ఆఁగుము. నీ మాటలచేఁ బ్రయోజనము లేదు. మాధవా! వచ్చినకార్యము నాలోచింతము. దుర్యోధనుఁడీ మడుఁగులో మన కందకుండ దాగియుండుటచే నాతఁడమాయావిద్య కతంబున సందేనిర్భయుండై యుండు. కావున సమరంబునకుఁ బిలిచినను వెలికి రాఁడేమో! వేదవిదితా! ఏమొనర్తము?

కృష్ణు—ధర్మజా! ఏల సందేహించెదు?

తే. గీ. మాయలనుఁబన్నియుఁ బాపంగు • మానవులకు
మాయచేతనె తగుశిక్ష • చేయవలెను

దుష్టచేష్టలఁ బ్రీతికీడు ♦ దురితచిత్తు
నట్టిచేష్టలె దండించు ♦ నంతమొందు.

మఱియు మాయామార్తి గదా హిరణ్యకశిపుఁడు జయింపఁ బడియె, యజ్ఞధ్వంసంబునఁ గదా రావణుఁ డోడెను. మాటల చాతుర్యమునఁ గదా బలిచక్రవర్తి పాతాళంబున కంపఁ బడెను. ఎప్పటప్పటి కేయే యుపాయం బుపయోగించెనో, నద్దానిచేఁ గార్యము సాధింతుము. విచక్షణాజ్ఞానమే శౌర్య శ్రేణమున మేలిభాగము. కావున నిప్పుడు దుర్యోధనుఁడు వెలికివచ్చు నుపాయంబు చూతుము. తరువాతఁ బని నాలో చింతము.

అర్జు — అన్నా! మనబావ తన లీలావతార చర్యల నెంత మృదువుగఁ జెప్పెను? అతఁడే యట్లొనర్ప మనము మానుట కాతనికంటె నెక్కువవారమా? అదియుఁగాక —

క. మన మింతదాఁకఁ జేసిన
యనిలో మోసంబు లెన్నో ♦ యగపడు టరుదే
యనుమాన మేల? నీకిటు
జనసుత! తుద కన్నిధర్మ ♦ సాధనముగుటన్.

నకు — అగ్రజా! అన్నియు నయినతరువాత నిప్పుడా సందేహించుట?

అందఱు — కాదు. కాదు.

**ధర్మ — మీరనినది యొక విధంబున మేలనియే తలం**

చెద. ఎట్లన దుర్యోధనుఁడు రాజ్యపదవి నున్నంతదనుక మనపై ద్వేషముచే నేదియో కల్లోలముఁ బుట్టించుచు ధర నశాంతిఁ గల్గించుచునేయుండు. దుర్యోధనుఁడు లేకున్న—నొకవేళయుండి, రాజకార్యంబులఁ జేరకుండెనేని—భూమిపై శాంతి కలుగఁగలదు. కావున నేనిదే హ్రదముతీరమున కేఁగి దుర్యోధను హెచ్చరించి పిలిచి, నావాక్యములకియ్యకొనునో లేదో యడిగెద.

భీము—అవేవి ?

ధర్మ—తాను క్షత్రియుండయ్యు మృత్యుభీతి నట్లు జలంబుల దాఁగుట సరికాదనియుఁ దానందుండివచ్చి మనలఁ బోరవలయుననియు, లేక యందున కియ్యకొనఁడేని మనకు రాజ్యమిచ్చి, తా నొయిదొల్గి ధర్మజీవితంబు గడుపుచునుండ వలెననియుఁ జెప్ప నుద్దేశించినాఁడ. సమ్మతమా ?

భీము—తను యిచ్చవచ్చిన ట్లొనర్పవచ్చును. కాని, యుద్ధమున కొప్పికొనక కురురాజు భీరుఁడై మననిచ్ఛించునేని, నా కెప్పుడెదురుపడకుండునట్లాజ్ఞాపింపుఁడు. అట్లెదురయ్యెనేని నా ప్రతిజ్ఞాప్రకారంబుఁ దొడల విఱుగఁగొట్టియే తీరువాఁడ.

అర్జు—వాని నిప్పుడు ప్రాణములతోఁ బో నిచ్చిన యెడల......

కృష్ణ—(నివారించి) అన్నగారికేల యెదురాడెదు! (జనాంతికముగ) అర్జునా! ఆసందేహమువలదు. ఈదినముననే సర్వమునుఁ బరిసమాప్తి కాఁగలదు.

ధర్మ—ఫల్గునా! ఏమంటివి?

అర్జు—ఏమియులేదు. నీ యిష్టమే.

ధర్మ—వేఁట కాఁడా! ఇదియేకదా ప్రాదము!

సరి. (చెంతకేగి) ఓధృతరాష్ట్రనందనా! దుర్యోధనా!

ఉ. చిన్నతనంబునుండి మముఁ
జేరగనీఁక, ధరాతలంబు మే
మెన్నియొ శాంతమార్గముల
నిమ్మనికోరిన నీక, నేఁడు నీ
వన్నుగడల్ సెడంగ, నిఁకఁ
బ్రాపితకర్మము వచ్చిచేరఁగా
విన్నన సెందకుండ మది
వీరునియట్టుల నిల్చి యోర్వుమీ.

చ. విదురుఁడు ద్రోణుఁడుం గృపుఁడు
భీష్ముఁడు నీ వెఱుఁగంగఁ జెప్పరే
కదన మనేక దుఃఖచయ
కారకమంచును వారి వాక్యముల్

మదిఁ దలపోయవైతి; ధర
మాకవుడే సగమిచ్చియున్న నీ
కిది సమకూఱకుండు భువి
నెల్లయు శాంతత మీఱియుండుగా,

7/120

సీ. ఈర్ష్యయుఁ గ్రోధంబు ♦ నెంతయో మదిఁజెంది
పట్టురీతి మాపైని ♦ బఱపివాని
సమరంబు కూడదు ♦ సంధియే మేలన్న
విహితులౌ పెద్దల ♦ వినుటమాని
పల్లదంబులనీదు ♦ పరితృప్తికై కొట్టు
దుష్టులమాటపై ♦ నిష్టమూని
సంధికై నేమున్న ♦ సర్వేశు నంపంగ
బంధించి యాతనిఁ ♦ బట్టఁబూని

తే.గీ. యొక్కసంతతివారిలో ♦ నుండరాని
యియ్యనీకంబె నీకిష్ట♦మయ్యెఁగాని
యాది నరయక నేనిప్పు ♦ డనిన వీని
యిందు దాగంగ సరియె నీ ♦ కింతయేని.

ఉ. ఐనదియయ్యె; నీవు వడి
నా మదువుక్ వెడలంగవచ్చి మా
తో నని చేసిచచ్చిన హి
తుల్ నృపులుం గురుబాంధవాదులున్

మానసమందు సంతసిల
మాపయిఁ బోరుము గెల్వ నీకె మే
లౌ, నిఁక నోడితేని దివి
నందెదు వీరులకబ్బు సౌఖ్యముల్.

కృష్ణ—పార్థా! మీ అన్నగారి కారుణ్యభావమును జూచితివా!

సహ—బావా! అది మే మెఱుఁగనిదా!

భీము—దాని మూలముననే కౌరవు లింతవఱకును నిగ్గఁజాలిరి.

ధర్మ—కరి పురేశా! ఇంకను వినుము.

సీ. నీ కొఱకే కదా ♦ నీ తమ్ములెందఱో
కడుపోరి కూలిరి ♦ కదనమందు
నీకొఱకే కదా ♦ పాికటనియతులౌ
తాతయు ద్రోణుఁడు ♦ ధరణిఁ బడిరి
నీకొఱకే కదా ♦ నిఖిలరాజచయంబు
పలునష్టములనందె ♦ బవరమందు
నీకొఱకేకదా ♦ నిఖిలకౌరవసైన్య
మాహవంబునఁ బోరి ♦ యవనిఁగూలె.

తే.గీ. నీకొఱకుఁగాదె చచ్చెన ♦ నీకమెల్ల
నట్టి నీవెల్లరును జావ ♦ నరిగి యుందు

మాడుపునందుఁ బ్రాణాశ • మహిమకతన
దాఁగెదవు వైరితతి నిన్నుఁ • దలఁచినవ్వ.

క. రమ్మింక నేల దాఁగెద
విమ్మడుపున, వెలికివచ్చి • యెల్లరు మెచ్చన్
మమ్మెల్లఁ గెలిచి భూమి, సు
ఖమ్మొందుము లేక దివి సు • ఖమ్మును గనుమీ.

(మడుఁవు లోనుండి దుర్యోధనుఁడు) ఎవరు నన్నుఁ బిలుచునది ?

ధర్మ—నీపినతండ్రి కుమారుఁడగు ధర్మజుఁడు. నీతో నొకింత మాటాడవచ్చితి. వెలికి రమ్ము.

దుర్యో—నాపినతండ్రి పెద్దభార్య యన్యకాంతయై వర్తింప యముఁడను గంధర్వునిచే నామెకుఁగలిగినవాఁడవా?

అందఱు—(కోపము నటింతురు)

భీము—ఓరీ! కురుకులహంతకా! నిన్నొక్కింతలో నా యమునిపురికే యంపెదము.

సాత్య—ఓరీ! కుంతీదేవి యాదవవంశజనిత యని మఱచితివిగా!

ధృష్ట—కులస్త్రీలవంచించుటలో నాదుష్టుఁడు కొత్తవాఁడా ?

1 ఉప—వీని తండ్రి జననము మాత్రమెట్టిది ?

అర్జు—ఈమాట సైపరానిది.

ధర్మ—సైపరానిదే, కాని, సర్వమును గోల్పడుటచే నీమూర్ఖునికి మతి తప్పినదేమో? ఇంకొకసారి చెప్పెద. ఓరీ! దుర్యోధనా! మే మెట్టిపుట్టుక పుట్టినను సత్కులోద్భవుఁడవు. నీవిందు దాఁగుటయేలరా ?

శా. తాతల్ తండ్రిలనాఁటి మాటలనుఁ బైఁ
దప్పింగ నేలా, మహా
ఖ్యాతింగాంచితి కౌరవేశుఁడయి సం
గ్రామంబునం గెల్వఁగాఁ
జేతంగాక బలంబులెల్ల మడియన్
సిగ్గింతయున్ లేకయే
భీతిం జెందితి సత్కులుండవయి
నీ పేరెల్ల నీరయ్యెఁగా ?

" ఉ. శూరుఁడ వంద్రుసీ మదువు
చొచ్చుట శౌర్యము చొప్పె! మానమే
యూరికిఁబోయె? నాజి నృపు
లోమదు రే నృపుఁడన్న మాత్రిమే
కౌరవవంశ జాతుఁడవు
కష్టపుఁ జచ్చుటఁ దెచ్చుకొంటి నీ
పేరును పెంపుమాని యరి
బృందము నవ్వఁగ నిట్లు సేయుదే ?

చ. కొడుకులు తమ్ములుం గలన
ఘోరపుఁ జావులు సావఁ జూచి యె
ట్లోడఁబడె నీదు బుద్ధి యొడ
లోముట కై నిను రాజరాజ యి
మ్మడువున కీడ్చి తెచ్చె విధి
మానము ప్రాణముకంటెఁ జాల, నె
క్కుడగుట చెప్పఁగా వినవొకో
కడు నీచతఁ బొంది తక్కటా !

శా. అంభోగర్భము సొచ్చి పాండుసుత బా
హాగర్వ దుర్వార సం
రంభంబోర్వక డాఁగియుండె నఁట !
రారాజిస్సిరో! చచ్చుచో
గాంభీర్యంబును ధైర్యమున్విడిచి, దో
ర్గర్వంబు బెండయ్యెనే !
శుంభన్మానము దూలెఁ గాకని జన
స్తోమంబు నిందింపదే.

చ. అని మము నోర్చినం బృథివి
యంతయు నేలఁగవచ్చు లేక చ
చ్చిన, సురసద్మ సౌఖ్యములు
చేకుఱు రెండు దెఱంగులందు, నో

ప్పనియదిలేదు, డాగనగుఁ
బాటును బ్రాణముచేటు దెచ్చుకో
ల్వీను, మము నీ వెమర్పఁదగు
వేయివిధంబులఁ జాటి చెప్పెదన్."

(భారతము; శల్య.)

సాత్య—ద్రౌపదీసోదరా ! కురురాజు మాటలమూలమున బావగారి క్రోపము హెచ్చయినది. వానిని బాణములతోఁ బోవనిచ్చునట్లు తోఁపదు.

ధృష్ట—కానిమ్ము. మంచిదే. ఆదుష్టుఁడు మనద్రౌపది కొనర్చిన పరాభవంబునకై వానిని ముక్కముక్కలుగ గోసి నేను నాకసిదీఱుదు.

దుర్యో—యమనందనా ! లోనిఉళ్ళ వెలికిఁ జెప్పితినని కోపించితివా ! క్షమింపుము. మఱియు నేను ప్రాణభీతిని నిందుఁ దాఁగితినని హేళనము చేసెదవేల ? మృత్యువన నెట్టి మూఢజంతువులును భయపడుచున్న బుద్ధిగల మానవుఁడే ప్రాణభీతి నొందుట యాశ్చర్యమా ?

సహ—కావుననే నీవు మృగతుల్యుఁడవు.

దుర్యో—మీరెప్పుడును ప్రాణభయంబును బొందనే లేదా ? ఆనాఁడు ద్రౌపదిని సభలో మే మిచ్చవచ్చినట్లు మానించుచుండఁగా నెనుబోఁతులవలె మీరందఱుఁ జూచుచుండియు నడ్డపడకుండుట మీరు కదలిన మా కరవాలంబుల కెర

యగుదురను భయముచే గదా ?

అర్జు—ఓరీ ! సుయోధనా! మే మప్పుడూరకుండుట మాయన్నగారి యాజ్ఞకు భయమందిగాని మీామీా తెల్లు పోచ లకు భయపడికాదు.

భీము—అన్నా! అన్నా ! ఎంతకాల మీాయసందర్భ ప్రలాపము !

కృష్ణ—(సంతోషముఁజూపును.)

ధర్మ—సుయోధనా ! ఈయనవసరంబులగు వాక్యం బులమాని వెలికివచ్చి యుద్ధమొనర్పుము. లేదా నిన్నిందుం చియే నీమడుగును బూడ్పించెద.

దుర్యో—మేలు. మేలు. నీవుపాండవులకేకాక చచ్చిన పాములఁగొట్టు వీరులకును, నగ్రజుండవని యెఱుఁగనైతి.

ధర్మ—ఏమీా !

దుర్యో—గజ తురగాది చతురంగబల సమేతులరై, సర్వబంధుపరివృతులై, జయోత్సాహులైయున్న మీా యంద ఱతో నొక్క రథమైనను లేక పట్టనాయుధంబును లేక, తోడ నొక్క యనుచరుండును లేక నిరుత్సాహినగు న న్నొక్కని బోరుమనుట న్యాయమా ? ఇట్టి యేకాకి నెంత దూఱినను లోకము నిన్ను వీరుఁడందురా ?

ధర్మ—ఇదియా నీ సందేహము ?

దుర్యో—కాదు. కాదు. మఱియుఁ గలదు. దినాది నుండియుఁ బోరిపోరి కడు బడలినాఁడ. మీరును నలసియే యుందురు. నేఁడు శిబిరములకేగి రేపు రండు. నేను నొకింత విశ్రమించెద. రేపు యుద్ధమున మిగిలినవారిని గూర్చుకొని వచ్చెద.

ధర్మ—మాధవా! తమ్ములారా! దీనికేమని తిరిగి చెప్పుదు?

భీమ—ఈదుష్టు నిప్పుడేవధించుటమేలు. వీఁడున్నంత కాల మనర్థకములు వచ్చుచునేయుండును.

అర్జు—ఔను. రేపటి ముం దెన్ని విశేషములు జరుగునో?

ధృష్ట—వీని నిప్పుడే కడ తేర్చిపోవుదము.

కృష్ణ—బావా! ముందీతని వెలికిఁదెచ్చు మార్గ మాలోచింపుము.

ధర్మ—దుర్యోధనా! బంధువధముతోనిండిన యిన్ని దినములును జాలును. ఈదినమే యుద్ధము చాలింపవలయు. కావున వెలికిరమ్ము.

దుర్యో—ఈ దినమున నే నెట్లయినను రాఁదలచుకొన లేదు. మఱియొకమాట! ఒకవేళ మిమ్ము గెలిచినను నే నొక్కఁడను నావారలు లేకయే యెట్టుల రాజ్యమేలఁగలను!

అట్టి పదవియేల ? కాల్పనా ? కావున నారాజ్యమంతయు నీ కిచ్చెద.

(అందఱు నవ్వుదురు.)

1 ఉప—ఓహో! పిన్నయ్యగారి యౌదార్యస్వభావమును, గాకము లెంత హాయిగాఁ బాడుచున్నవి.

2 ఉప—శునకములు నన్నిలోకములకుఁ దెలియునట్లు ఘోషింపుచున్నవి.

సహ—గర్దభములో.

సాత్య—అన్నా! వయసుమీఱినతరువాతఁగులట పతివ్రత యగునుజుమా!

కృష్ణ—అది లోకములో సహజమే.

ధర్మ—ఓరీ! దుర్యోధనా! నీ దాక్షిణ్యస్వభావము నెంతగాఁ గొనియాడవలెను ? నీవు రాజ్య మిచ్చెదవా? ఆదినుండియు నీచరిత నెఱుఁగనివానివలె నాకు నీ వినయము నేర్ప వచ్చెదవా ? అట్లు భూమి నిచ్చువాఁడ వేయయిన నీ సంకులమంతయు నేల కలుగవలయు ?

సీ. ఆదినుండియు మమ్ము ♦ నణఁపజూడఁగనేల ?
భూమి నీయఁగనీకు ♦ బుద్ధియున్నఁ
బరుణిని సభలోనఁ ♦ బరిభవింపఁగ నేల ?
భూమినీయఁగనీకు ♦ బుద్ధియున్నఁ

గలుప రీతినిమమ్ము ♦ గానకంపఁగనేల?
భూమినీయఁగ నీకు ♦ బుద్ధియున్నఁ
బొత్తుకోరకపోరు ♦ పురికొల్పికొననేల?
భూమినీయఁగ నీకు ♦ బుద్ధియున్న,

తే. గీ. వినుము నీమది నాబుద్ధి ♦ వీసమున్న
నీరములదాఁగఁగానేల? ♦ నీచునటులు?
మమ్ము శిబిరంబులకుఁ బంపి ♦ మైమఱపున
నుండ కసితీర్పనూహింతు ♦ వేండెగాక

కృష్ణ—(మందహాసముచేయును.)

నకు—ఈతఁడంతటిపనికిని దగినవాఁడె.

ధర్మ—సుయోధనా! ఒకవేళ నీవిప్పుడిచ్చినను నేను బరిగ్రహింపను.

మ. నృపులేనాఁడును దానముల్ గొనరు వా
నిన్ శత్రురాజీయశౌ
ర్య పథంబే గయికొంట? కావ వృథగా
నాలస్యమింకేల నీ
కపటంబెల్లనుమాని రమ్మిటకు, సం
గ్రామంబునన్ నిన్ను ధా
త్రిపయింగూలఁగనేసి, మీఁదట ధరి
త్రిన్నేను బాలించెదన్.

అర్జు—జయము! జయ మగ్రజా! బాగుగఁ బల్కితిరి?

భీము—అన్నా సెలవిమ్ము. వీనితో నిన్ని మాటలేల. నీటఁజొచ్చి యిప్పుడే యీమూఢుని వెలుపలికి నీడ్చి తెచ్చెద.

ధర్మ—వృకోదరా! అంతెట్లుపోయెదు? ఆతఁడందు జలస్తంభన విద్యాబలోన్నతుఁడై యున్నాఁడే! భూమిపై నే మయినఁ జేయఁగలము. నీటిలో వాని కిప్పుడు స్థానబలిమి కలుగుటచేఁ దొల్లి కరీంద్రునిఁ నొంచిన మకరిపోల్కి నాతఁడు నిర్భయుఁడు. కృష్ణా! ఏమి చేయుమనియెదవు?

కృష్ణ—కోపంబునఁ బడకటింటఁ బ్రవేశించిన భామిని వలెనే నావిద్యతో నీటఁ బ్రవేశించిన వాఁడును బ్రబలుఁడై యుండు.

అర్జు—మనసత్యాదేవికతన బావకది యనుభవమే.

సాత్య—మీ దుర్యోధనన్నను బోలు ధుర్యులందరు నబలలైన మముఁబోలు బావలగతి యిఁక నేమౌను!

సహ—అచ్యుతా! మాయన్న దేహంబున నబలఁ కాకున్నను నీవనినట్లు మనోవిధంబులచే నంతమాత్రమైన వాఁడు.

1 ఉప—అహాహా! మనపిన్నయ్య కిట్టి పిఱికితన మున్నదని తెలిసియుండిన నీయుద్ధమయి యింతమంది చచ టకుఁ బూర్వమే వాని భీరు స్వభావమునకుఁ దగినట్లు కా గృహాపురాణివాసం బందుంచియుందుముగదా!

2 ఉప—ఔను. అప్పు డాతఁడు కాంతలనింతకు రెం డంతలు పోలియుండును. ఎట్లన్న స్త్రీలకు నెండసోకని యంతః పురంబులలోను వీనికి వెలుతురేచొరని కారాగృహాంతరమున నివాసము. వారికిఁ జేలికలగు సువర్ణ కంకణములు. వీనికి మిక్కిలి బలువులగు నినుప కంకణములు.

కృష్ణ—(పురికొల్పును.)

సహ— అట్లైన మా దుర్యోధన మహారాజు పిఱికి వాఁడా! దుర్యోధనమహారాజా! వీరు నిను బిఱికివాఁడను చున్నారు.

నకు—అక్కటా! కరిపురేశ్వరునకుఁ గోపమువచ్చునే మో! మనగతియేమి?

ధృష్ట—కరిపురేశ్వరుఁడు కావుననే వీనికిఁ నేనుఁగున కున్నంత ధైర్యమున్నది.

2 ఉప—కావుననే కరికున్న గుణమీయన కింకొకటి యున్నది.

కృష్ణ—ఏమిగుణము?

2 ఉప—గజము నీటిలోఁ బ్రవేశించి మగుడి రా ననును. చూడుఁడు. మాపిన్నయ్యయు రెండు దినములనుండి నీళ్ళలోనున్నను వెలికి రాననుచున్నాఁడు.

సహ—చూచితివా! సుయోధనా! నిన్నువీరందఱు

హేళనము చేయుచున్నారు. అన్నా !

ధృష్ట—అన్నా ! అనెదవేల ? "అక్కా" యనుము.

సాత్య—ఎట్లనిన నేమి ? నీటిలో జపముచేయువారికి స్త్రీపురుషభేదముండునా ?

కృష్ణ—ఏమి జపము ?

అర్జు—కొంగజపము.

1 ఉప—అంతకంటె నెక్కువ జపమే.

2 ఉప—ఎట్లెక్కువ ?

1 ఉప—కొంగ నీటిలో నొక్క కాలేయుంచి యొక గంటసేపు మాత్రమేచేయును. మనరాజునీటిలోనొడలంతయు ముంచి రెండు దినములనుండియు జపము చేయుచున్నాఁడు.

సహ—కాదుకాదు. రారాజుచేయుజపమైపోయినది. కావున స్నానార్థమై యిందుదిగి కొంచమాలస్యము చేసినాఁడు.

అర్జు—ఓహో ! పుణ్యస్నానమా?

దుర్యో—(హ్రదమునుండి పైకురుకును. పాండవులు వెనుక కురికి హ్రదమున కడ్డముగా నిలుతురు.)

దుర్యో—

మ. అరరే ! అర్జున ! క్రిం దుమికెదెట్లుఁగకీ
వట్లాడెదేలాననుఁ
బిఱికింగాఁ దలపోసియాఁడుదనుచుం
- జ్రేలంగ శంకింపవా !

విరటుంగొల్చినవేషముల్ మఱచితే !
వేయేల నే గారవే
శ్వగుఁడో! యోఁడుదియో యెఱుఁగుమిఁక నీ
వాక్ప్రౌఢిమల్ మాన్పఁగాన్.

(అని పై కురుకఁబోగా కృష్ణుఁడు దుర్యోధనుని; భీముఁడు అర్జునుని పట్టి నిల్పుదురు.)

కృష్ణ—రారాజు మహావీరుఁడని నేమొదటనుండియే చెప్పలేదా !

భీము—తమ్ముఁడా ! ఈ నీచుని నీవే వధించిన, నా ప్రతిజ్ఞ నెరవేఱుటెట్లు ?

ధర్మ—విజయా ! ఆతఁడు తను ప్రాణాదులు లేక యున్నాఁడు. అట్టివానితోఁ బోరుట యధర్మము.

అర్జు—అన్నా ! క్షమింపుము. వీఁడు పైకివచ్చినతీరు చూచి యొకింత కోపించితి. వృకోదరా ! నీప్రతిజ్ఞ త్వరలోఁ దీర్పుము.మన మకంటకుల మయ్యెదము.

దుర్యో—(తనలో) నేకోపముతో నీరు వెడలివచ్చుటచే మోసము జరిగినది. నేఁదలంచినంత మందికంటె నెక్కువమంది యేవచ్చి నను ముట్టడించి యున్నారు. అందఱపై నొక్క పెట్టునఁ బోరిననన్నిప్పుడేఁజంపుదురు. మగుడిహ్రదముసొచ్చుటకు వీ రడ్డముగ నిలిచియున్నారు. ఏమి చేయుదును ?—ఆ ! తెలిసినది. వీరందఱు నాపైఁ బోరకుండునట్లు ధర్మరాజు

నడిగెద. ఒక్కొక్కఁడుగావచ్చి నా గదాయుద్ధమునకుఁ బురికొల్పి యెల్లర నుక్కడంచెదఁగాక! మొదట ధైర్యమునటింపవలెను.

కృష్ణ—బావగారేమియో దీర్ఘాలోచన మొనర్చుచున్నారు.

సహ—కాదు. ఇప్పుడేగదా పుణ్యస్నానమైనది. అక్కా!

మఱచితి—అన్నా! రెండు దినములనుండి స్నానముచేయుటచే నీయొడలెంత శుభ్రముగానున్నది!

దుర్యో—ఓరీ! కీచుపిట్టలారా! మీహేళనములింకను మానరుగా! మీకందఱకు నే భయమందెద ననుకొంటిరా! సింహరాజము సృగాల సంకులంబునకు జంకెడునఁటరా!

చ. కరి తురగాళి రథ్యములుఁ
గల్గినవారలు మీరలెల్ల సం
గరమునగెల్చి యుబ్బితిరి
కాని దురంబున నోడితేను, దో
సరుగఁగఁలేఁ డెవండు నొక
యాయుధమేదియులేదు పోని మీ
పరుసఁ దనంబులే నడఁతుఁ
బ్రల్లదముల్ గడుఁ బల్కుచుండినన్.

నకు—ఓహో! మాప్రలాపంబులు మాన్పించుటకుమారు [illegible]హారాజమే ప్రలాపించుచున్నదే!

1 ఉప—సింహరాజమా! లేకసింహచర్మాలంకృతుం పై యుపాయికుల భక్షింపఁజేయు గర్దభరాజమా?

1 ఉప—నాకు రెండవది యనియే తోఁచెడిని.

దుర్యో—ఎటూ! ఏమంటిరి?

ధర్మ—సుయోధనా! ఆబాలకుల మాటలకేల? నా సుడువుల నాకర్ణింపుము. నీవొంటవయి యిట్లు మాపైని పోర వచ్చుట నీధైర్యమునే చాటించుచున్నది. కాని యిట్టి యస హాయుఁడవయిన తనుత్రాణాదులును లేకయున్న నిన్ను మే మందఱమునుగూడి చంపుటకుఁజోరులమా? ఆపాటిధర్మము తెలియని వారమా? కావున మాలో నొక్కొక్కనితో నొక్కొకసారి వేఱుగాఁబోరుము.

దుర్యో—(తనలో) మంచిది. ధర్మరాజు దారికి వచ్చు చున్నాఁడు. (ప్రకాశముగా) నీయిచ్చవచ్చిన ట్లొనర్పుము. రండు. ఒక్కొక్కఁడు రండు. వచ్చినవాని వచ్చినట్లు నా ముష్టిఘాతంబున నుగ్గుఁజేసెద. ఒకవేళ నట్లు వేఱువేఱుగా రా భయమునందెదరా అందఱును గలసిరండు. సూర్యుఁడు తన కిరణజాలంబుచే నిరులఁబాఱ దోలినట్లు నీవారందఱి బాహాబల విజృంభణమునఁ బరిభవించెద.

నకు—అవునౌను. సూర్యుఁడవు. సూర్యుండంబుదం బులమాటున దాగినట్లు నీవును నంబువుల [illegible]నదాఁగితివి.

ధర్మ—తమ్ముఁడా ! ఆఁగుము. దుర్యోధనా ! నీ మాటలకు మెచ్చితిని. కాని యవసరమేల ? మాయొద్దనుండి తనుత్రాణంబులఁ గైకొనుము. వలసినచో నొక్క రథముం గయికొనుము. ఆపయింబోరుము. ఇంతియకాక నేను నీ కొక వాగ్దానమిచ్చెద. చూడుము.

"చ. వలసిన యస్త్రశస్త్రములు
వాహనముంగొను మొక్కరుండనిన్
గలనజయించు వాఁడతని
గర్వము నీ వడగించితేని, నీ
యిల సకలంబుఁగైకొని
వహింపుము రాజ్యవిభూతి వాఁడనిన్
తలపడిపోరు చుట్టలును
దక్కటివారలు చూచుచుండగాన్.
(భారతము—శల్య)

దుర్యో—మేలు. మేలు. ధర్మజా! నీయుదారతనుతింప నగును. కాని నామాట వినుము.

"చ. అరదములెక్కి ఘోరవివి
ధాస్త్రచయంబులమున్ను పోరమే
నరవరకోత్తచందము
[illegible]బు కరంబు ప్రియంబుసేయు ని

స్థూర గదలం బదాతులయు
శూరతయున్ మహనీయ ధీర తా
స్ఫురణతయుం బొగడ్తవడఁ
బోరుట మేలని నిశ్చయించెదన్.

తే. గీ. వింతకూరలు కడుపున ♦ వేడ్కఁ సేయు
భంగి, సంగ్రామమున నాత్మ ♦ భంగు లెదకుఁ
గౌతుకము సేయుఁ గావున ♦ గద ధరించి
నిను సహోదరులను యోధు ♦ లను జయింతు.
(భారతము—శల్య)

ధర్మ—మంచిది. దుర్యోధనా ! మొదట నీతో నేనే పోరెద. నన్నుజయించి మరల నీరాజ్యమునకు రాజవగుము. ఇదె తనుత్రాణాదులఁ గైకొనుము. ఓరీ ! సేవకా !

సేవ—అయ్యా !

ధర్మ—కురురాజునకు వలయు కవచాదులునుగదయుఁ గొనితెమ్ము.

సేవ—చిత్తము. (అని కవచాదులు దెచ్చియియ్యఁగా దుర్యోధనుఁడు ధరించుచుండును. అంతలో భీముఁడు, అర్జునుఁడు, కృష్ణుఁడు నేదియో రహస్యమాడుదురు.)

ధర్మ—దుర్యోధనా ! మఱియొకటి. నన్నుఁబోర నీకిచ్చలేకుండెనేని మాయైదుగురిలో నెవ్వరినైనఁ గోరుకొనివాని

జయింపుము.

దుర్యో—గదాయుద్ధమున మీలో నెవ్వఁడయినను సరియే. ఒక్కొక్కఁడుమాత్రము రండు.

ధర్మ—సరియే. కాని నాఁడు మాయభిమన్యుని మీ రందఱును జుట్టి యధర్మరీతిఁ జంపరా!

దుర్యో—(తెల్లఁబోయి తనలో) ఇదేమి? వీరునన్నుఁ దుదకు మోసపుచ్చి పలువురు పైఁబడి చంపెదరా యేమి?

ధర్మ—భయపడకుము. నీ వేమందువోయని చెప్పి చూచితిని. మీరొనర్చిరని మేమును బాపము చేసెదమా! భయ మందకుము. తనుత్రాణాదులు నెమ్మదిగా ధరించు కొనుము.

కృష్ణ—ధర్మజా! ఇటురమ్ము. బావా! నిదురవచ్చు చున్నదా?

ధర్మ—మాధవా! ఇదియేటి ప్రశ్నము? ఇప్పుడేమి నిదుర?

కృష్ణ—కలువరించుచుంటివనుకొంటినిలెమ్ము.

ధర్మ—అట్లేల యనుకొంటివి?

కృష్ణ—నీవు శత్రురాజుతో మాటలాడు విధము చూచి—

ధర్మ—ఏమంటిని?

కృష్ణ—నీవు తెలిసి పల్కినపల్కులు వీరందఱు విని

యుండ మఱలనే జెప్పనేల? కానిమఱల నరణ్యావాసముచేయు కోరిక కలదా ?

ధర్మ—అరణ్యావాసమా! కృష్ణా! ఈ వాక్యముల పర్యవసానమేమి ?

కృష్ణ—ఏమియా! ఆనాఁడు రాజ్యమును జూదమున బందెముగానొడ్డి కోలుపోతివి. ఇప్పు డింతమంది బంధువుల గోలుపోయి మిగులఁ గష్టముతో గెలిచిన రాజ్యమును సమానముగ గదాయుద్ధమునఁ గోలుపోవనున్నావు.

ధర్మ—ఎందుచేతఁ గోలుపోవలయు ?

కృష్ణ—ఇఁక నెందుచేత నేమి ?

తే. గీ. ఒక్కఁడొక్కండు నినుఁ గదా ♦ యుద్ధమందుఁ
బోరు, నందొక్కని జయించి ♦ భూమి మఱల
నేలుకొమ్మం" టి, పలనితో ♦ నింతకంటె
నోడు నందియమింకేమి ♦ యుండఁబోవు.

ఆ. వె. వేరువేర నితని ♦ పోరంగగడఁగొని
పంపరాదుకూడఁ ♦ బవనసూను
నైన, భీముకంటె ♦ నా రాజునకుఁ గదా
యుద్ధమందు తెలివి ♦ యెనవునయ్యా.

ధర్మ—అచ్యుతా! నీవనినట్లు దుర్యోధనునకు గదా యుద్ధంబున సమానకౌశలంబుఁ గలదు. కాని నేఁబోరెద



నని మాగుడి యెట్లు మానుదును ?

భీము—అన్నా ! నీవు కల్లలాడవలదు. మన వైమ గురిలో నెవ్వనినయినను రమ్మనికదా చెప్పియున్నాఁడు. ఆ మూర్ఖునిపైఁబోర నన్నువిడువుము. నీవు రాజవుగాన, మొదట పోరాడుట తగదు. నీయనుచరులలోఁ బెద్దవాఁడ నేఁబోయెద.

కృష్ణ—మేలు వృకోదరా ! లెస్సనాడితివి.

సీ. ఏకచక్రపురంబు ♦ నేచు బకాసురు
మట్టించి పురివారి ♦ మనిచితీవు
మాంద్వారకాపురి ♦ మఱిమఱివేధించు
నా జరాసంధుని ♦ యణఁచితీవు
కామాంధకారంబు ♦ గప్పిన కీచకు
ఖండించి ద్రౌపదిఁ ♦ గాచి తీవు
దుష్టుఁడై నట్టి యా ♦ దుస్ససేనుని జంపి
యుదరరక్తముఁ ద్రావి ♦ యొనరితీవు

తే. గీ. నాఁడు ద్రౌపది యంకంబు ♦ నకునుబిలువ
నాసభను గోపమున బాసఁ ♦ జేసితీవు
నేఁడు రారాజునకు దాని ♦ నిజముఁ దెలుప
ధర్మజునియాజ్ఞఁగొని పోరఁ ♦ దగుదువీవు.

భీము—కేశవా! నీవనినవన్నియు నీకృపామహిమచేతనే కదా నేఁ జే[illegible]తిని. మిగిలినదియు[illegible] నీదయచేఁగాఁగలదు.

అన్నా! కృష్ణుని యాశీర్వచనము లందితిని. ఇంక నీ యాజ్ఞ కావలయు.

ధర్మ—నాకెట్టి యభ్యంతరమును లేదు. కాని దుర్యోధనునితో మొదట నే బోరెదనంటినే?

అర్జు—(కృష్ణునితో నేమో చెప్పును.)

కృష్ణ—ధర్మజా! ఒకవేళ దుర్యోధనుఁడే మొదట భీమసేనునితోఁ బోర నిచ్ఛించిన నీవొప్పవుదువా!

ధర్మ—అప్పు డొప్పఁగలను.

కృష్ణ—(దుర్యోధనుని చెంతకరిగి) బావా! నీవు మొదట నెవ్వరితోఁ బోరెదవు? ఏలయన్న ధర్మజుతోఁ బోరితివా! యాతని గెల్చినను ఆకోపమున దక్కిన వారందఱు నినుఁ జుట్టుముట్టి చంపెదరు. ఇఁక బాలురతోఁ బోర నీకు మాత్రము దానవచ్చు ఘనత యేమి? కావున భీమసేనుఁడే తగినవాఁడని నాయుద్దేశము. ఏమందువు?

దుర్యో—నాకెవ్వరైన సరే!

కృష్ణ—ధర్మజా! రారాజెవ్వఁడయిన సరియే యను చున్నాఁడు.

అర్జు—అన్నా! శంక యేల? వృకోదరున కాజ్ఞయొసఁగుము.

భీము—అగ్రజా! అనుగ్రహింపుము. నా కీతనిపైఁ గోపము మెండు గల్గెను. లేకున్న నింత[illegible]ంపను.

ధర్మ—సరియే. (అని యనిష్టముగా సెల వొసంగు చున్నాఁడు.)

భీము—ఇంకేమి కావలయు. అన్నా! వందనము. నీకుఁ గించిత్కాలముననే ధరణీరాజ్యము పట్టంబుగట్టెద.

కృష్ణ—జయము! జయము! భీమసేనా!

తే. గీ. పరజయమునొంది కట్టుము ♦ పట్టమఖిల
ధరణిరాజ్యంబునకు ధర్మ ♦ తనయుఁ బ్రీతి
బంధులకునెల్ల కన్నుల ♦ పండువగుచు
నీవుదమ్ములు సుఖవృత్తి ♦ నెలవుకొనుఁడు.

(భారతము—శల్య)

అందఱు—జయము. జయము.

(అంతఁ గదలు గైకొని భీమసేన దుర్యోధను లెదుర్కొని నిలుతురు.)

భీము—ఓరీ! దుర్యోధనా! మున్ను నీవు మాకొనర్చిన నేరము లన్నియు జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. అదుగో భగవంతుడగు శ్రీకృష్ణుఁడందే యున్నాఁడు. క్షమార్పణము వేడికొమ్ము నీకుఁ బరలోకముననయిన ధర్మబుద్ధి యేర్పడునేమో!

దుర్యో—కార్యమునకుఁ గడఁగుము. ఆకసంబు పగుల నిక నాకేము లఱచినతోడనే నాకు హానియగునా?

వింటిని. తుదకు నీస్థితి యింతకు వచ్చినదా ? వగవకుము. ఇవన్నియు దైవకృత్యములు. మనమేమియుఁ జేయఁజాలము. కానున్నదికాక మానదు. చేత నయినంతదనుక ధైర్యముతో నటించుటయే మనపని. కానిమ్ము; ధైర్యముతోఁ బోరుము.

దుర్యో—బావా! నీవు వచ్చుటచే నాయంతరంగంబు మిగుల సంతసించుచున్నది. ఏలయన్న, నీవుండ నెట్టియన్యాయమును జరుగనేరదు.

బల—ఆ! ధర్మజుఁడుండ నీకట్టి సంశయమేల కలుగవలయు ? సరియే ! నే వచ్చితినిగదా ! మేలయ్యె. భీమసేనా? క్షేమమా ! పోరిలో నతివీరుఁడవై మెలంగితివని వింటిని. సంతసంబయ్యె. అర్జునా ! నీశౌర్యమును దరువాత సావకాశముగా శ్లాఘించెద.

అర్జు—బలదేవా ! అదియంతయు నీ తమ్ముఁడగు కృష్ణుని మహిమయే.

అందఱు—అవునౌను.

బల—(తలయూచి)సరియే. శిష్యులారా ! మీరిద్దఱు కలఁతపడవచ్చును. నేనాజ్ఞయొసంగితి. కాని మును నాయొద్ద నేర్చిన ధర్మంబు దొలంగకుండవలయుఁ జుమా! తొలంగితిరా యీనాబాహువులలోనింకనుకొంతబలిమియున్నది. జాగ్రత్త. ధర్మజా !కూర్చుండుము. తమ్ముఁడా! పాంచాలురారా! అంద ఱునుకూర్చుండిరి

భీము—అన్నా! సెలవా!

ధర్మ—మంచిది! అందఱునునోయిదొల్లి దూరముగా గూరుచుండుఁడు. (భీమసేన దుర్యోధనులు యుద్ధము సేయుదురు.)

(కొంతసేపైనతరువాత)

అర్జు—(జనాంతికముగాఁ గృష్ణునితో) వృకోదరుఁడీ పోరున నంతగాఁ దేజరిల్లుచున్నట్లులేదే? తుదకు ధర్మరాజున కపకీర్తి తేఁడుకద! నీ వేమని తలంతువు?

కృష్ణ—తలంచుటకేమున్నది? కన్నులయెదుట జరుగుదానిగురించి నీకు వేరొకరి యభిప్రాయమేల? చతుర్ధ్వారమేమయిన ప్రాప్తించినదా?

అర్జు—హేళనముమానిదయయుంచిచెప్పుము. దేవా!

కృష్ణ—ఇంతదనుక మీయన్నయే మిగుల నొప్పింపఁబడెనని నీకుఁ దెలియును. ఏలయంటివేని, మీ రరణ్యమున కేగినదాదిగ నీ పదుమూఁడేండ్లును బరిశ్రమం బధికముగఁ జేయుటచే దుర్యోధనునకుఁ గౌశలం బధికంబయినది. మీయన్న భీమునకు దేహబలంబుమాత్ర మధికంబుగానున్నది. కోపముచే శత్రురాజుపై కుఱికి వాని నిపుణత్వమునకు లోనయి దెబ్బలఁ దినుచున్నాఁడు. కావున మీయన్న తొందరపడక నిదానించి తలపడిన జయంబందగలఁడు.

అర్జు—అయిన నిప్పుడేమి చేయవలెను?

కృష్ణ—ఏమియు వలదు. ఇప్పుడు మీయన్న మీ కొక గొప్పయుపాయమును దెచ్చిపెట్టియున్నాఁడు. యుద్ధమున నోడి, పారిపోయి యొక మడువున దాగినవానిని వెలికిఁ బిలిచి మాలో నొక్కనిజయించిన నీ రాజ్యము నీ వేలుకొనుమని వాక్యమిచ్చినాఁడు. ఇది దారిఁ బోవువానిఁబిలచి తన తలపై కెక్కుమన్నట్లున్నది.

అర్జు—నీ కెట్టి యుపాయమును దోఁచుటలేదా ?

కృష్ణ—ఏమియుఁ దోచుట లేదు. ఒక విషయము మాత్ర మున్నది. గదా యుద్ధమున నాభి కధోభాగమునఁ గొట్టఁగూడదని నీ వెఱుఁగుదువు. కావుననే దుర్యోధనుఁడు క్రిందనంతగాఁ గాయుటలేదు. కాని మన భీముని ప్రతిజ్ఞ తొడల విఱుగఁగొట్టెదననిగదా! కావున నా ప్రతిజ్ఞ కొన సాగుటకై యాతఁడు నాభిక్రిందఁ గొట్టఁగూడదను ధర్మము నతిక్రమింపవచ్చును.

అర్జు—ఆహా! తెలిసినది. బావా! వందనము. వెప్పుడు మాపాలింటి దైవమవేయై యుంటివి. (అని భీముఁడు తనకై చూచినప్పుడు) జయము! అన్నా! జయము! ఈ తెగుననే వేయుము. (అని తొడలఁ జఱచుచున్నాఁడు.)

భీము—(తెలివి నభినయించి సమయము చూ తొడలు విఱుగవేయును.)

దుర్యో — హా! బలరామా! (అని కూలుచున్నాఁడు)

(మూర్ఛపోవును.)

భీము —

శా. ఓరీ! కౌరవవంశపాంసన! సభన్
యోషామణిన్ బిల్చితే
క్రూరత్వంబున నంకభాగములపైఁ
గూర్చుండుమంచిప్పుడా
బీరంబేగఁగ నీతొడల్ విఱిగ నీ
పెంపెల్ల వ్రాయెన్ ధరన్
భారంబెంతయుఁ దగ్గెనీకుఁదగు ని
ష్పాటిప్డు చేకూఱుటన్.

గీ. ఇంతదాఁకను రాజనై ♦ హీనసుతుల
వినుచు మాకుఁ దెచ్చితి వీవు ♦ వెతల నెన్నొ
కాని నీ రత్నమకుటంబు ♦ కాలఁదన్న
వారలిప్పుడెట్లు వచ్చెడి ♦ వారె నీకు.

(అని దుర్యోధనుని కిరీటంబు కాలఁదన్నుచున్నాఁడు.)

బల — (దిగ్గున లేచి భీముని వెనుకకుఁ ద్రోచి)

ఆఁ! ఆఁ! నే నుండఁగనే! నేనుండఁగనే!

ఉ. ఓరి వృకోదరా! గురుఁడ
నుండఁగనే గదపోర దను [illegible]

దూరము సేసి యంకములఁ

దర్పించితి వంతియ కాక దుర్మతిఁ

ధారణినాథునొదల, ను

దగ్రతఁ గ్రాలు కిరీటరాజమున్

ఘోరున వాముపాదమున

భూస్థలి రాలఁగఁ దన్నఁ బాడియే.

తే. గీ. పాండవులు యుద్ధమున ధర్మ ♦ భంగిఁ బోరి
రనుచు వింటిని మాచర్య ♦ లరసి యిపుడు
కనులమును నీవు దన్నిన ♦ కౌరవేశు,
గౌరవంబునకై నిన్నుఁ ♦ బోరుదేను.

(భీముఁ డేదియో చెప్పఁబోగా, ధర్మార్జునులు నివారించి వెనుకకు లాగుదురు.)

దుర్యో—(మూర్ఛ దెలిసి) బలరామా! గురువరా నీ వుండుటచే నెట్టిమోసమును జరుగదను నమ్మకముచేఁ గ్రింది కాపు నేమఱియుంటిని. కాని గురువుంటమైన శంకింపకయే యాదుష్టుఁడు గదాయుద్ధధర్మము నతిక్రమించి నా తొడల విఱుగనేసెను. ఈయధర్మంబునకు నీవే శిక్షింపవలెను. హా! హా! (అని తిఱిగి మూర్ఛపోవుచున్నాఁడు.)

బల—అవును. తప్పక శిక్షించెద. భీమా!... ...

కృష్ణ—అన్నా! కథయంతయు మొదటనుండియు

నెఱింగిననీవే యిట్లనిన నెట్లు? గదాయుద్ధమున నాభికిఁ గ్రిందఁ గొట్టరాదను నీతి నే మాత్రి మెఱుఁగనా ? కాని భీముఁడు నాఁడు సభలోఁ జేసిన ప్రతిజ్ఞ మఱచితివా ?

జరా—అవును. నీవు పాండవపక్షపాతివని మఱచితిని.

కృష్ణ—ఔను ! నేను పాండవపక్షపాతినే. కాని య ట్లేల యైతినని యోచింపుము. పాండవులే యధర్మ మొనర్చి రందువు. ఇప్పుడొనర్చిన దధర్మమగునా కాదా. అందు వేమో అట్లయిన మాయచే నొక పందెము గెలిచి. యొంటి వస్త్రంబునున్న పతివ్రతను దెచ్చి సభలో నెల్లరు జూచుచుండగా వలువలొలుచుట గొప్ప ధర్మకార్యమా ! భూమిపై జనులు జూడమాడరా? గెలువరా ? అంతమాత్రమున నోడిన వారి యంగనల సభాంతరమున భంగపఱతురా ! అట్టి భంగము నోర్చియుఁ బాండవులుధర్మమునకులోఁబడియుండరా? అప్పుడు కోపమునఁ జేసిన ప్రతిజ్ఞ పూనికతోఁ దీర్చియోద శాబ్దములును వహించి వృకోదరుండు నేఁ డతికష్టముతోఁ దీర్పఁజాలెను. ఇన్నియేండ్లనుండి పూనియున్నదాని నెఱవేర్చుటయధర్మమా! అట్లు పామరులనుకొనవలెనుగాని నీవనుకొనరాదు. ఎవ్వరేని నేదేని శిక్షననుభవించుచుండఁజూచి దానికిఁ గారణమారయ కయే జాలిపడఁదగదు. అట్లయిన భూమిపై ధర్మాధర్మములును, నీతినియమంబులును, సంఘ నిర్మాణంబులును నశించి యెంతయు నల్లకల్లోలములుగ నుండును. అప్పొగొన్నవారు

మరలఁ దగుకాలమున ధనమూనీయవలయు. నేర మొనర్చిన వాఁడు శిక్ష ననుభవింపవలయు. ఇది సామాన్య ధర్మము. కావున నకారణమగు కోపం బుడిగింపుము.

ధర్మ—బలదేవా!

బల—(నివారించి) కృష్ణా! నీవిందున్నప్పుడు, కౌరవులకు ధర్మము గలిగింపవచ్చుట నాదే తప్పు. ఆనాఁడు సుభద్రను రారాజున కీయఁ గోరినప్పుడు నీ వడ్డుపడి యర్జునున కిప్పించితివి. నాకూఁతురు శశిరేఖను లక్ష్మణకుమారున కీయ నెంచి యుండఁగా నీ టక్కుటమారులతో మమ్మెల్లర మోసపుచ్చి విజయుని పుత్త్రుఁడగు నభిమన్యునకిచ్చితివి. యుద్ధమునఁ బేరునకు బాణమొక్కటైనను నీయిందద్రిజాల మహిమచే బాండవుల కెన్నెన్నో మేళ్ళొనర్చితివి. అన్నియు నీ యిచ్ఛానుసారంబుగ జరిగినవి. ఇదియు నట్లే కానిమ్ము, ఆది నుండి తుదివేల భిన్నముగానుండవలయు?

(నిష్క్రమించుచున్నాఁడు.)

(అందరు తెల్లఁబోయి యొండొరుల మొగంబులు జూచుకొందురు.)

కృష్ణ—కానున్నది కాకమానదు. ధర్మజా! కులపాంసనుండగు దుర్యోధను నడంచుటచే నీతమ్మునిఁ బ్రస్తుతించి మహీవలయంబునకు రాజవై సత్పథంబున మెలంగుము. అది

మా యెల్లర విజ్ఞాపనము.

అందఱు—నిజము. నిజము. అదియే మాకోర్కె.

ధర్మ—మాధవా! బంధులారా! నన్నింత యాదరం బొనర్చినందులకు మీకెంతయుఁ గృతజ్ఞుఁడను. కాని నేనిట్లు రాజగుటకొఱకు వధింపఁబడిన బంధుజనసంఖ్య నెన్నికొన నా కడుపు తఱుగుకొని పోవుచున్నదిసుమా! అది యట్లుండె. తమ్ముఁడా! వృకోదరా! నీవే నాఁడొనర్చిన సంగరంబునకు మే మెల్లరము నినుఁ గొనియాడఁ దగియున్నది. సుయోధను గదా తాడనములచే నీ మే నెంత నొచ్చెనో కదా!

భీము—అన్నా! నే నిప్పు డందిన జయము, కృష్ణుని కృపామహిమచేతను, నీ దయచేతను, వీరియెల్లర యనుగ్రహంబునఁగాని వేఱుకాదు. ఇఁక నీ ప్రేమ వీక్షణంబులు సోఁకినంతనే నాఁటిమొదలి శ్రమయంతయు మాయమై పోయినది.

ధర్మ—సంతసంబాయె. సంజయా! మా రాజునకుఁ దొడలు విఱిగినవి. బ్రతుకఁజాలఁడు. కావున నతఁడు జీవంబులతో నుండునఱకు నీ విందేయుండుము. నవవీరా! నీవు కూడ నుండి వారిద్దఱకు నుపచారం బొనర్పుము. మాధవా! మనమింకఁ బోవుదమా?

కృష్ణ—అట్లే పోవుదము.

దుర్యో—(మూర్ఛ తెలిసి) కృష్ణా! పోయెదవా? ఇంతయు నొనర్చి పరభూరాట్ కిరీటరత్నవిరాజమాన పాదుండగు నీరారాజు నీ మంటినేలకుఁ దెచ్చినవాఁడవు. కడసారి మాటలు వినిపోమ్ము. నిన్ను భగవంతుఁడని యనేకు లనేక నామములఁ బిల్చుచుందురు. కాని నాకానమ్మకము లేదు. అందఱ జనులవలెనే నీవునునీకును, నీవారికిని మేలుకోరి పరుల మోసపుచ్చు మాయకాఁడవని నానమ్మకము. అందునఁగాదే నీవు నీ సొంతబావలగు పాండుసూనుల పక్షమువాఁడ వయితివి. ఇప్పుడు నీచేఁబురికొల్పఁబడి తొడలుగొట్టుమని యర్జునుఁడు సన్నచేసినది నేను జూచితిని. లేకున్న, మాయందఱ నొకనితరువాత నొకని బుట్టిపెట్టియుండనా? శిఖండిముందు నిడుకొనఁజేసి పార్థుచే భీష్ము నడంచితివి. ధర్మజుచేఁ గల్ల నాడించి ద్రోణుఁ జంపితివి. రథంబు భూమిలో గ్రుంగించి యర్జునుగా పాడి కర్ణుని జంపితివి. ఇంక నెన్నియో విషయముల విచారింప నీవే యీనాగతికి మూలకారణుండవైతివి. కృష్ణా! నాకిన్నిరీతుల నపకారమొనర్చిన నిన్ను నాకు బలముండిన నిప్పుడే చంపియుందును గదా!

కృష్ణ—దుర్యోధనా! నీ వెన్ని యనినను, నాకుఁ గోపము కలుగక విచారమగుచున్నది. నీస్వభావమంత కలుషము కాదు. పరులు చెప్పినమాటలు విని చెడితివి. ఇంక నీవు నాకుఁ బక్షపాతగుణ మారోపించి దూషించితివి. పెద

తోఁగివను బోవు మూర్ఖులందఱవలెనే నీవును నీవు పట్టినపట్టుందేటికి మూఁడే కాళ్ళనుచున్నావు. నీ వనినట్లు నేను బాండవుల పక్షమే. అట్లేలయుంటి నన్నవారు ధర్మవర్తనులు. ధర్మపక్షమే నాపక్షము. ధర్మపరులే నాకత్యాసురక్తులు. నీకితరులొనర్చినవి తలపోసి వెతలఁబడెదుకాని నీ వితరుల కొనర్చినవాని నెంచుము. నీవు పాండవుల కొనరించిన దోషముల నెన్నుట పునరుక్తి దోషంబేగాక విన్నవారికి విసుగుపుట్టును. కావున గతంబునకు విచారింపక శాంత మనస్కుఁడవయి మృతినొందుము. భగవంతునితో నీయపరాధముల మన్నింపుమనుము. నీకు సద్గతి చేకూఱుఁగాక! నేఁబోయెద. నా తుది మాటలు వినుము. ధర్మమే జయమ్. ధర్మమే జయమ్. ధర్మమే జయమ్.

(అందఱు నిష్క్రమింతురు.)



# ద్వితీయాంకము.

## రెండవరంగము.

సంజ—అక్కటా! సర్వమహీమండలాధీశుని గతి తుదకింతకు వచ్చినదా! ఎంతటి వాఁడయినను "నాకెట్టిశక్తి గలదు. నన్నెవ్వరేమిచేయఁజాల"రని విఱ్ఱవీఁగరాదు. అందులకు దార్కాణ మీదుర్యోధనుఁడే. తా నప్పుడు రాజ్యోన్మత్తతచేతఁ గాటకపాటకులమాటలువిని పాండవులనెన్నియో యిడుమలఁ బెట్టెను. ఇప్పుడు నినుఁబోలు ముసలివాఁడును, రాజున కొక క్రోశదూరమున నుండఁదగు నీ వనవీరుఁడును దక్క నితరులగు ననుచరులు లేక పడియున్నాఁడు.

[తెరలో]

ఆ! లేకేమి! లేకేమి! (అశ్వత్థామ ప్రవేశించి)

అశ్వ—దేహంబులో జీవంబులున్నంతదనుక, రారాజసేవాతత్పరుండనై యాతని శత్రుపులఁ గరవాలమున కెఱ చేయ నేనుండలేదా.

సంజ—ఓహో! అశ్వత్థామా! వచ్చితివా! ఇప్పుడు

నీ వేచునిన నేమి ప్రయోజనము ? సర్వము పరిసమాప్తమయినది.

అశ్వ—జరిగిదానిని గొంతవినియే యిచ్చటికివచ్చితిని. కాని నీవన్నట్లు సర్వమును బరిసమాప్తముకాలేదు. కాలచక్రమునకుఁ దుదిమొదలనునదికలదా ?

దుర్యో—(మూర్ఛ తెలిసి) ఎవ్వరక్కడ ? అశ్వత్థామవలె నున్నాఁడే !

అశ్వ—అవును. రారాజా ! నీ గురుపుత్త్రుండును, సహపాఠియు ననుచరుండును నిన్నిస్థితిలోఁ జూడవలసివచ్చిన దురదృష్టవంతుఁడునగు నశ్వత్థామ యితఁడే.

మ. పలురాజుల్ గొలువంగ నోలగమునన్
బంధుప్రియశ్రేణితో
నలరం గాంచితి నిన్ను నిప్డ డడవిన్
హా ! హా ! తొడల్ నుగ్గులై
తెలివిన్గోల్పడి పీన్గు గుట్టలకడన్
దీనుండవై వేదనన్
దలకంజూడఁగఁ గల్గెనే విధిగతిన్
దాటంగలే కయ్యయో.

గీ. పాండురాజసూనులు ధర్మ ♦ పరులఁటంచుఁ
బలికెదరు రెండు దినములు ♦ వస్తునున్న

నిన్నుఁబోరికిఁ బురికొల్పి ♦ కొన్న విజయ
మార్యులొనరించు పనియొకో ♦ యరసిచూడ.

(ప్రవేశము—కృపాచార్య కృతవర్మలు.)

కృతవ— ద్విపద.

హా! రాజ నీవిట్టు ♦ లైతివే తుదకు
వైరిరాజుల గెల్చి ♦ వసుధఁ గైకొనఁగ

కృపా—మునుమున్న నిటు చెప్పి ♦ మొగ్గరంబనను
విన వైతి మే మెంత ♦ విన్నవించినను.

కృత—మమ్మెంతకరుణతో ♦ మనుచుచుంటివి
నెమ్మియి నినువీడి ♦ యిలనుండఁగలము.

కృపా—నిను వీడకుందుము ♦ నీమిత్రవితతి
చనిరెందఱో కూలి ♦ సంగరంబునను.

దుర్యో—(కన్నీరు విడుచును.)

సంజ—వంత దెచ్చెడితొంటి ♦ వాక్యంబులేల,
చింతింపకయ రాజు ♦ చెవిఁజేర్తురయ్య.

అశ్వ—ఔనౌను గతమున ♦ కార్తిఁజెందకుఁడి.
కానున్నదరయుఁడి ♦ కౌరవేశునకు.

కృపా—రారాజ! పగమాని ♦ రయముగ మాకుఁ
గోరి చెప్పుము నీకుఁ ♦ గోదువయుండినను.

దుర్యో—రథికవరులారా! నాకర్మము నన్నింతకు దెచ్చినది. మీరు నాకై విచారింపకుడు. ఇంతదనుక నకొఱకై పోరినందులకు నేననేకవందనములర్పించుచున్నాఁడను నాకిఁక నెట్టి కోర్కెయున్నను నేమిలాభము? కావున మీరేగి పాండవులపంచఁజేరి వారి సన్మార్గములఁజూచి మెచ్చుఁడి

అశ్వ—రాజా! ఏల యట్లనెదవు? నీ కేమి కోర్కెయున్నను నేమి లాభమా! అట్టికోర్కెఁ దీర్పఁ బాత్రుఁడవు నయిన నీయనుద్యుక్తుఁడనగు నేను లేనా? మఱియుఁ బాండవుల ధర్మమునుజూచి మెచ్చుమని యెకసక్కెముగా నంటివి! వారు నీకోడఁ బోరుచో నేమయిన యధర్మమొనర్చిరా!

దుర్యో—ఉపయోగములేనిమాటల నేల త్రవ్వెదవు?

అశ్వ—ఉపయోగ మేలయుండఁగూడదు. నిన్నాది నుండియు సోదర భావమునఁజూచు నాతోఁ జెప్పుట యనుపయోగమా!

దుర్యో—ఇన్నాళ్ళనుండియు నీవు మాత్రము పోరి యుండ లేదా! అప్పుడు లేనివస యిప్పుడెక్కడనుండివచ్చెను?

అశ్వ—చిన్ననాటనుండియు నా శౌర్యమెఱిఁగిన నీవే సందేహించుచుంటివే. నాదురదృష్టము. ఇన్నినాళ్ళనుండియు నొకరి యాజ్ఞానువర్తినై పోరవలసివచ్చె. కావున నాకు యిచ్చవచ్చినట్లు మార్గాన వీలులేకుండవచ్చినది. ముందే నీవు నాకు

సైన్యాధిపత్య మొసంగియుండిన నింతకు వచ్చియుండవు. అయి నది కానిమ్ము. ఇప్పుడయినను నాజ్ఞయిమ్ము. నీశత్రువుల గతి యేమగునో చూచెదవుగాక!

కృపా—అశ్వత్థామా! అకారణంబుగ నేలవాగ్దానము చేసెదవు. రారాజా! నీ సేవకులమైన మేము నీయాజ్ఞఁ దీర్ప వలసినదే. ఐనను నీమనంబున నున్నదానిని జేయనునుచున్నం దులకు క్షమింపుము. ధర్మయుద్ధముననేకదా జయింపఁబడితివి.

దుర్యో—నీ వుంటివి కనుకనే అశ్వత్థామ కేమియుఁ జెప్పనంటిని.

అశ్వ—ఎవరున్న నేమి? లేకున్న నేమి? నీసేవాతత్పరుండ నేనున్నాను. చెప్పుము.

దుర్యో—సరియే. చెప్పకతప్పదు, కావున చెప్పుచున్నాఁడ. మీరు ముగ్గురునువినుఁడి. నేనట్లు కొలనిలోనుండఁ బాండవులును, పాంచాలురును, సాత్యకియు, మఱి యనేకులును జయోన్మత్తులై నవ్వుచు హాస్యంబులాడుచునాక్రందన మొనర్చుచు నిచ్చటికివచ్చి నన్ను వెలికివచ్చి పోరుమనిపిలిచిరి.

కృత—నీవేమంటివి?

దుర్యో—ఏమియుననక కూర్చుంటిని. అంత యుధిష్ఠిరుండు తటంబుపై కెక్కి నన్నుఁ బిలచి యెన్నెన్నియోగతుల దూషించుచు రమ్మనెను.

కృపా—అప్పుడు వచ్చితివా!

దుర్యో—లేదు. అంతకును దగినయుత్తరము లిచ్చి యూరకుంటిని. అప్పుడు వారు కోపించి నన్నెన్నిరీతుల బెదరించి యింకను రాకుంటఁజూచి నే నాఁడుదాననను చెప్పరాని మాటలచే హేళనము చేయఁజొచ్చిరి. నే నవి సహింపఁజాలక పైకుఱికి మఱలమాఱ్కొంటిని.

అశ్వ—తమపని నెఱవేర్చుకొనుటకు వారెంత చేసిరి! తరువాత.

దుర్యో—తరువాత కృష్ణుఁడెన్నియోమాయమాటలు చెప్పి నన్ను భీమునిపై గదాయుద్ధమునకుఁ బురికొల్పె.

అశ్వ—అతనికంటె నీకుఁ గౌశలమధికమే! కూ లేయకపోతివా?

దుర్యో—కూలనేసియే యుందును. కాని కృష్ణుఁడు చెప్పఁగా నీ పితృహంతకుఁడగు నర్జునుండు తొడలపైఁ గొట్టుమని భీమునికి సైగఁజేసెను. గదాయుద్ధంబున నాభికిక్రిందఁ గొట్టుట యధర్మంబగుటను బలరాముఁ డిందుండుటచే నట్టి యధర్మము జరుగదను ధైర్యమునను నేను గ్రిందికాఁపుమాని యుంటిని. అంత నాభీముఁడు నాతొడలు విఱుగనేసె.

అశ్వ—తెలిసె. తెలిసె. నిన్నువారు మోసముచేతనే జయించిరా! ఓరీ! భీమసేనా! ఏనుఁగువలె స్థూలశరీరముండె నని విఱ్ఱవీఁగుచుంటివా! ఆకసమెంతయో మెఱుంగుము.

దుర్యో—నాగతి యంతటితోఁ గాలేదు. ఇంకను

వినుము. అంతట నేను భూమిపైఁగూలఁగా ముందుమున్నంత బాధించితివి. ఇప్పుడు నీకు దిక్కెవ్వఁడనుచు భీముఁడు నా కిరీటము నేలఁ బడఁదన్నెను.

అశ్వ—ఏమీ! నీ కిరీటమును దన్నెనుగా! సామంత రాజమకుట మణిపుంజరంజితపాద కమలుండగు హస్తినేశ్వరు నుత్తమాంగంబుపైఁ గాలి కిరీటరాజమ్ముం దన్నితివిగా! భీమా! అతని కిరీటమే నేలఁగూలెను. కిరీటముతోఁగూడ నీ శిర మెందుండునో చూచెదనుగాక!

దుర్యో—అప్పుడే యయినదా? ఇంకను వినుము. నే నట్లు ధారుణిపై నసహాయుండనై యుండ వారందఱు కసి తీర నన్నిచ్చవచ్చినట్లు దూషించిరి. అవి తలఁచుకొననైన శక్యముకాకున్నది.

(దుఃఖించును.)

కృపా—ఊఱడిల్లుము, రాజా! ఊఱడిల్లుము.

దుర్యో—కృపాచార్యా! ఎట్లూఱడిల్లఁగలను? సర్వ మహీమండలి నేలువాఁడ. ఈ చెట్టునీడఁ బడియుండవలసి వచ్చెనని యూఱడిల్లుదునా, నా రాజ్యంబంతయు వైరుల స్వాధీనమయినదని యూఱడిల్లుదునా! నాగుడ్డియయ్యయు ముసలితల్లియు వెనుకఁ బాండవుల సంరక్షణములో దిగఁబడి రని యూఱడిల్లుదునా! నా మానసంబును దహించు క్రోధం

బింకను దీఱ లేదని యూఱడిల్లుదునా! మిగిలియున్న మీ ముప్పురును నాకోర్కెఁ దీర్పక నీతి చెప్పెదరని యూఱడిల్లు దునా!

అశ్వ—రారాజా! ఏల యీమాటలు? సెలవిమ్ము. సెలవిమ్ము. చేసివచ్చెద. లేక చచ్చెద.

దుర్యో—ద్రోణనందనా! ఇంకొక మాటయున్నది. రణమున నెల్లరును వలదువలదని యఱచినను మృతినొందు చున్న నీతండ్రి గొంతుఁగోసినయా ధృష్టద్యుమ్నుఁడును న న్నెంతయో దూషించెను. నీతండ్రిని నిన్నునుగూడ ననెను.

అశ్వ—ధృష్టద్యుమ్నుఁడే!

దుర్యో—అయినదియైనది. ఇఁక మీరు నా కొఱకుఁ బ్రియాసపడ నేల? పోయిపాండవులఁ గలియుఁడు.

అశ్వ—వినుము, కురురాజా! ఈ పాండవులపై నీ కెంతకోపమున్నదో నా కంతకంటె నెక్కువయే యున్నది. కావున సెలవిమ్ము. నాతండ్రియాన, నీతండ్రియాన, మన యంతరంగముల కోర్కెలఁ దీర్చెద.

దుర్యో—ఏమిచేయనుంటివి?

అశ్వ—సెలవిమ్ము. ఆపైకార్యము నాది.

దుర్యో—నీ వడిగినట్లే చేసెద. కృపాచార్యా! ఒక పాత్రతోఁ గొ[illegible]మజలము తెమ్ము.

కృపా—(తనలో) నేననుకొన్నదియైనది జలముతేక తప్పదు.

(అనిపోయిజలముతెచ్చును,)

దుర్యో—మేలు ! అశ్వత్థామా ! నీచేయి యిటుదెమ్ము. నాప్రియగురునందనుండగు నిన్ను నాసర్వసైన్యమునకు, అకటా ! ఇంకెక్కడిసైన్యము ! అందఱునుమడిసిరికద కానిమ్ము. మిగిలిన యల్పసైన్యములకే అధిపతిఁజేసితి. నీవు దోచినరీతి వైరులఁజంపి యావార్త నాచెవులవేయుము.

అశ్వ—జయము. జయము. ఇప్పుడైనను నేఁజేయు ప్రతిజ్ఞవినుఁడు. అందఱునువినుఁడు.

సీ. నిఖిలలోకక్షయా • నీతకారణుఁడు న
తుగ్రప్రభావుఁడౌ • రుద్రునాన
సకలశస్త్రాస్త్రకౌ • శల వీరవితతిను
దగ్రుఁడైనట్టి నా • తండ్రియాన
సర్వదేశాధీశ • సన్నుతవిభవుఁడై
తేజరిలిన కురు • రాజునాన
వైరినిదాఘంగ • వారాశిబడబాగ్ని
కరణి నోలాడు నా • కత్తి యా



తే. గీ. నంక భంగంబుచేనొచ్చు ♦ నవనినాథు
పాణములువోవు ముందుగా ♦ బవరమందు
నోడిపోయిన కసివైరావ ♦ నుర్వినే వ
పాండవంబుగ నొనరింతుఁ ♦ జండమతిని.
(నిష్క్రమింతురు)



శ్రీ

# దుర్యోధనాంతము.

## తృతీయాంకము.

కౌరవశిబిరప్రాంతము

ప్రవేశము—భూతభీరుఁడు ; లంబపాదుఁడు.

లంబ—వోరన్నా ! భీమసేనరాజుగారి యేటకాడికి, కోళ్ళు మేకలు యిస్తానంటివి! యిచ్చావు ?

భూత—వోరన్నా ! వాడిమొగాన ఆ రొండుకోళ్లు మేకలు వెట్టడానికి యెంతనచ్చిచెడ్డానురా !

లంబ—ఏం ?

భూత—ఏంచేయుమంటావు ? 'యిస్తావా? నస్తావా?' అని కంసాలి పీనుగులాగొచ్చి గొంతుకిమీఁదకూనున్నాఁడు.

లంబ — యెక్కడ దెచ్చావు ? ఆకోళ్ళు మేకలు.

భూత — ఓరన్నా ! అది తలుసుకుంటే నాకు కడు పుబ్బ వవ్వొస్తాది. ఆకుమ్మరెంకి దగ్గఱ పెద్ద నల్లబొచ్చు పెట్టుండాది. మెరుగుదూ ? ఏది ? ఆకుంపటంత కోడిపెట్ట. దానికోసంపోయి గుడిసెంగో యిస్టే దాని పెట్ట కెకుర్రుమున కుండ లాగేసుకొచ్చాను. ఆగడపలో రొంకి నల్లగేదె వాల పడుకోనుంటే చీకట్లో కళ్ళు కనపడక దానిమీంద బోకబోర్ల పడితి.

లంబ — వహావ ! ఎంకిమీంద నే ! నీమీంసాల్నిండ కలు సారా. మంచిపని. సరేకాని యిక్కడి కెందు కోసంవచ్చావు.

భూత — మన దుర్యోధనరాజు తొడ విరిగి ఆమడుగు దెగ్గెరపడివుండాడంట. నీకు తెలుసునా !

లంబ — వోరన్నా ! నాకు తల్సుకుంటే యేడ్పొస్తాది. మహారాజుకాలంలో, యేదోవొకయుద్ధం, యేదోవొకకొట్లాట, వంటివాళ్ళు నలుగురు పొట్కపోసుకోవటానికి వీలుగా డేరా ! ఇప్పుడు ధర్మరాజుగాడొస్తాడంట. పనిలేక గడ్డాలు చుకోని, నోటితో సదా యేదో, గొణుగుతూవ్రుండే నపండలకేగాని మనబోంటి కష్టజీవులికి బ్రితుకులేదురా.

భూత — ఔనురా ! వచ్చేది కలికాలం కాదటరా ! ! గడిసిపోయిందాన్ని పోనీ ! ఇప్పుడు నాకు మంచి యం తోస్తుండది.

లంబ—(తొందరగా) యేంటది. చెప్పు. తొరగా చెప్పు. నీకు నాకు సగబాగం.

భూత—వ్యోరి ! నువ్వింత తొందరపడితే చెప్తా ?

లంబ—తొంరలేదు. చెప్పుబాబు. నీపొట్టనిండా నక్క మాంసం !

భూత—యెవ్వరితో చెప్పవుగదా !

లంబ—చెప్పను.

భూత—యెవ్వరితో

లంబ—చెప్పను.

భూత—వ్వొట్టూ పెట్టుకో.

లంబ—నీకుక్క బుద్ధితోడు.

భూత—వ్యోరీ అట్లయితే నన్ను పగలకోసినా చెప్పను.

లంబ—లేదు. లేదు. బాబు. నాయెంకితోడు.

భూత—సరే. చెప్తా బాగాయినను. ఇదిగో చూడూ దుర్యోదనరాజు చస్తాపడివుండాడు. యిక్కడ ఆయన డేరాలో వ్వాళ్ళందరు పారిపొయ్యారు. ఇక్కడింకా సొమ్ము చాలా వుండాదట. ఏం ? ఏమంటావు.

లంబ—సరే ! ఆలోనకిపోయి తెచ్చేదెవ్వరు ?

భూత—ఛీ ! నన్ను పిరికోడంటావు ? నీకూ పిరికితనమేనా ! ఏహే ! అది తేవట మొంతపని. నేనుపోయి తెస్తా.

నీవు బయటవుండి యెవ్వరైనా వస్తే "సూ.సూ" అని యీల వెయ్యి. అంతే నీవు నాకు చెయ్యవలసింది.

లంబ—సరే పద.

భూత—సరే! కానినువ్వు కొంచం ముందునడు. అదుగో! కొంచెంలోపలికి పోయి, యెవ్వరైనా వున్నారేమో చూడు.

లంబ—వోరీనువ్వు పోతానంటివికదా!

భూత—నువ్వెవ్వరు లేకుండా చూస్తానన లే.

లంబ—అట్లనే. చూస్తాం. తర్వాతనువ్వు పోయి తేవాలసుమా!

భూత—వోరన్నా! నేవెనక్కు తీస్తానటరా! కానీ వునడు. ఊ! పద!

లంబ—(నెమ్మదిగా పోవుచున్నాడు.)

(కౌరవసైనికుడు ప్రవేశించును.)

భూత—(ఉలికిపడి) వోరన్నా! దయ్యం.

లంబ—(పరుగెత్తివచ్చి భూతభీరునిపట్టుకొని) అయ్యా! వోయిబంటుదొరా! యిదుగో దొంగ, రాజుగారు పోయినారని విని వచ్చాడు.

భూత—అయ్యా! వాడే దొంగ లోపలికప్పుడే పోతే మీరెవ్వరైన వప్పగించాలని నేను బైటకూసొనివుండా!

లంబ—లేదయ్యా! వాడే దొంగ.

భూత—వాడేనయా!

కౌర—ఛీ! ఛీ! కుక్కలలాగు వాగకండి. మీరిద్దరు దొంగలులాగున్నారు. మిమ్మలినిద్దఱను నాకత్తికి బలిపెట్ట నున్నాను.

లంబ—నేను దుర్యోధనరాజుగారి నౌకరను. వీడే దొంగ.

భూత—నేనే వారి నౌకరను. కాలికింద మనిషిని. వీడే దొంగ.

కౌర—రాజు చచ్చినతర్వాత, నాతని మూలమున పొట్టఁబోసికొని బ్రతికినవారందఱు, నాతని సొత్తుచేఁ జిక్క నంత దోచుకొనిపోవటము సహజమే! క్రొత్తకాదు. అయినా రాజు పోయినతర్వాత మిమ్మలిని నేను పట్టి చేసేదేమిట కాబట్టి, పొండి! ఇక్కడలేకుండా పొండి.

లంబ & భూత—అమ్మయ్యా! బ్రతికినాము. (నిష్క్రమింతురు.)

కౌర—అయ్యయో! ఈనాడు మాకెంత దుర్దినము. కొండంత మహారాజుకూలగా చూడవలసివచ్చెగదా! ఆయన ముందు మేమైన చచ్చిపోయినట్లైతే ఈవార్త వినకుందుము.

[తెరలో]

అర్జునా! నీగాండీవమును నాయుధములును దీ[illegible]ని యారథ

మునకు దూరముగా బోవును.

కార—అదుగో! అర్జునా! అంటూ కృష్ణుఁడు వస్తు న్నాఁడు. అబ్బ! ఈనల్లవాని కడుపుమండ! మా రాజుకీదున కీయనే మూలము.

(లోపల గొప్ప వెలుఁగు)

అరే! అదేమిటి? అర్జునుఁడుగారి రథము కాలిపోతున్నది. ఇక్కడ వుంటే మేము కాల్చినామని మాపైకి వస్తారు. నేను పోయెదను.

(నిష్క్రమింతురు.)

ప్రవేశము—పంచపాండవులు; కృష్ణుఁడు.

అర్జు—కృష్ణా! ఇది యెక్కడివింత?

ఉ. చేసితినే సమీకములఁ
 జిన్నతనంబుననుండి నెన్నియో
చేసిన యీరణంబుల వి
 శేషతరానలకీల జాల మం
దీసరిగాఁగ రిత్త మెయి
 నెల్లరు నబ్బురపోవ రథ్య సో
ద్భాసితమైన తే రెపుడు
 దగ్ధమండి నశింపదారయఁ.

ఆ. వె. మఱియునిన్నినాళ్లు ♦ మహిత యోధవరుల
కెదురనిలిచినను, మ ♦ హేశు, శ్రీశు
సారథిగనుగన్న ♦ తేరూరకయపోవ
చింత వొడము నేమి ♦ సేతు కృష్ణ.

కృష్ణ—బావా! ఏలయంటివా? అది నీకెందులకు? దానితోఁ గావలసిన పనియైనది. ఇఁక నది కాలిపోయిననేమి? పోకున్ననేమి?

సహ—బావా! మాయర్జునన్న నీగీతామృతమునన్ని నాళ్లు విన్నను, సంబంధం బూడినందున కింకను జింతించుచున్నాఁడు.

భీమ—ఏది యెట్లున్నను, విజయురథము కాలుటలో నా కౌరవుల మాయయున్నట్లే నాకుఁ దోఁచుచున్నది.

ధర్మ—పాపము కౌరవులపని యంతయు నయినది. ఇఁక వారేమి చేయఁగలరు? కాని మాధవా! అర్జునురథ మేల కాలవలెను?

కృష్ణ—మీరింత యడుగుటఁబట్టి చెప్పవలసివచ్చెం. ధర్మజా! ఆనాఁడు, యుద్ధారంభమునకుముందు, నీవు నా కర్జుననొప్పగించి యుద్ధమున నాతని కేయపాయము రాకుండ గాపాడుమని కోరితి. జ్ఞప్తియున్నదా?

ధర్మ—లేకేమి? బావా!

కృష్ణ — కావున కౌరవవీరుల మహాస్త్రములనుండి యాతనిఁగాపాడితి. ఐననునర్జునుచేసుమాత్రము, భీష్మకర్ణాదుల మంత్రపూరితంబులగు బాణంబుల వేఁడిమిచే నప్పుడే, కాలి యుండవలెను. కాని యట్లుకాకుండుట యసందర్భముగనుండునని, మందనీక యిప్పుడు కాల విడిచితిని.

ధర్మ — నే మొదటనే చెప్పలేదా! తమ్ములారా!

ఉ. స్యందనవారమెక్కి కదు
సాహసవృత్తిని బాణజాలముల్
పొందుగఁ జేతఁబట్టి రణ
భూమి నరాతి నృపాళి నార్తిలోఁ
గుందగఁజేసి యెల్లరము
గొప్పగ వెల్గితిమైన, నెల్ల పెం
పొందగ, డిందఁజేయ యదు
పూరుషసింహునిచేత గాదొకో.

కృష్ణ — ఓహో! ఇట్లుతిరిగినదా! ధర్మజా! ఇందు నేఁజేసిన దేమియులేదు.

నకు — బావా! చేసినదానిని నీవు చెప్పకొనక పోయి నను మేము మఱతుమా!

సీ. మాతండ్రి పాండుని ♦ మరణమాదిగ దయా
మతి, బిడ్డలట్లు ప్రో ♦ చితివిమమ్ము

నకు—అలనరణ్యావాస ♦ మందున దయతోడ
వెతలందకుండఁ గా ♦ చితివిమమ్ము,

అర్జు—ముక్కంటి మొనలైన ♦ మొనగాండ్రఁ గెల్పించి
యతి వీరులుగను జే ♦ సితివిమమ్ము

భీము—దుష్టదుశ్శాసన ♦ దుర్యోధనులఁ జంపి
గత శాత్రవులుగఁ జే ♦ సితివిమమ్ము

ధర్మ—తే.గీ. పేరువెత్తి యియ్యదియంచు ♦ వేరవేర
పలుకఁగా నేల బొందితోఁ ♦ బ్రాణములను
గలుగుటాదిగ జయరమా ♦ కలితవిలస
దతులితైశ్వర్యయుతులఁ జే ♦ సితివిమమ్ము.

కృష్ణ—బావలారా! మీరునన్ను నిష్కారణముగ బొగడుచున్నారు. పోరిలో విజృంభించి తలపడినవారుమీర గెలిచినవారుమీరే. అర్జునా! నీవనిలో నెంతవీరుఁడవై చేగినది నే నెఱుఁగనా? ఆ ద్రోణ కర్ణాదుల బాణపరంపరకు వంటి యసమాన వీర్యవంతుఁడు గాక యన్యుఁడు నిఁయుండునా!

అర్జు—నీకిష్టము లేకుండ మేము నిన్నుఁ బొగడినదా కిది ప్రతిక్రియయా?

కృష్ణ—ఇఁక నేఁ జేసినదంత, తాతతండ్రుల, నన్నదమ్ముల, గురుశిష్యులను జంపుటకుఁ జేతులాడవని, విల్లువిగిసి, కూర్చున్న మీ విజయమునకు నానేర్చియుండిన వేవియో రెండు

విరక్తిమాటలు చెప్పి యనీకమునకుఁ బురికొల్పితిని. సరియే; ఈవిషయ మట్టుండనిండు. ఒకరినొకరు సావకాశముగాఁ బొగడికొందము. ధర్మరాజా! పాంచాలురను, ద్రౌపదేయులను మన శిబిరమునకంపి వచ్చితిమిగదా! ... ... ...

ధర్మ—బావా! నీవువారల శిబిరములకంపుటయనఁగ జ్ఞప్తికి వచ్చినది. వారలందఱు మనల వీడ్కొనిపోవునప్పుడు, మరలవారిని సజీవులుగఁ జూతుమో చూడమోయను నొక రీతి సంకోచమును విచారము నామనసు నావరించెజుమా! దానిలో నేమయిన నిజముండునా?

అర్జు—ఏమో! అన్నగారి మన సెప్పుడును రిత్తవిషయంబులపైఁబోదు.

భీము—కౌరవులందఱు చచ్చినతర్వాతఁ దమకింక నట్టిసంకోచ మేల కలుగవలెను?

నకు—కౌరవులందఱును జచ్చిరా?

సహ—ద్రోణసుతుండగు నశ్వత్థామ......

కృష్ణ—(నివారించి) బావలారా! లేని యూహాములఁ గల్పించుకొని యూరక యేల వట్టి యనుమాన పిశాచంబుల పాలగుదురు? కౌరవులలోనెల్ల ముఖ్యుండును, బలిష్ఠుండును నగు రారాజ చిరకాలంబుకిందటనే భీమసేను గదాఘాతములకు లోనయ్యెను......

సహ—కాని ద్రౌణి... ...

కృష్ణ—(నివారించి) ఇఁక మీర లెట్టి సంశయంబును బొందవలదు. ధర్మజా! నీవు గడచినవన్నియు మఱచి, యిదే నీపాలఁబడిన కౌరవశిబిరంబును, దానిలోఁగల ధనకనకరాసులను బరీక్షింపుము.

ధర్మ—మాధవా! నీవు చెప్పినట్లు మఱతుమన్నను, మఱపునకురాక యీ కౌరవశిబిరము చూచుచున్న కొలఁది నాకు దుఃఖంబధికం బగుచున్నది. ధనముచే మిగుల నిండి యున్నను నీ స్థలమెంత జాలిగలిగించుచున్నది!

సీ. దైవప్రతిమ లేని ♦ దేవళంబునుబోలి,
వహ్ని రేఁగిన యిండ్ల ♦ వరుసఁబోలి
పౌరుషంబుడిగిన ♦ ప్రభుకులజునిఁబోలి,
గర్భంబు తొలఁగిన ♦ కాంతఁబోలి
తోయజాలఁ బెండి ♦ పోయిననదిఁబోలి
ఘనతరుల్ గొట్టిన ♦ వనముఁబోలి
మణులూడఁ బెఱికిన ♦ మహితహారముఁబోలి
దయలేని మనుజు వ్రా ♦ దయముఁబోలి
తే. గీ. పాడువడియొక్క దీపముం ♦ బగను నేరు
లేక, చిమ్మ చీఁకటనిండి ♦ భీకరముగ
కౌరవేశ్వరు శిబిరంబు ♦ కళఁదొలంగి
చూపఱకు దుఃఖ కరమయ్యెఁ ♦ జూడుకృష్ణ.

భీము—ఆనాఁడు మన మరణ్యావాసమున కేఁగునప్పుడు మనయిల్లెంత జాలిగలిగించుచుండెనో యెవ్వఁడైన నూహించెనా ?

ధర్మ—తమ్ముఁడా ! చేయఁదగినదంతయుఁ జేసియే తీరితిమి. ఇంకెందులకు వారిపైఁగోపము ? మాధవా ! ఇటు చూడుము. ఇయ్యది కురురాజు తననూర్గురుతమ్ములతోడను, గురు పితామహులతోడను భూమీసురవరులతోడను సర్వ పరివారముతోడను గొలువుండు ప్రదేశము. అక్కటా ! ఇప్పుడందు శునకాది నీచ జంతువులు గుర్గుమురుచున్నవి. ఛీ ! యని తోలువారైనను లేరుగదా ?

తే. గీ. భవ్యకళలొల్క నీ సభా • భవనమందు
కురు నృపాలుండతని బంధు • గురుజనులును
కొలనునిండిన జలపక్షి • కులము తెఱఁగు
సౌఖ్యముండిరి కాఁబోలు • సంతసమున.

భీము—మన మరణ్యమున నిడుమల నందునప్పుడు.

ధర్మ—మన మెట్టివంతల నందినను దుదకు రాజ్యంబు గూడి పాలించునను నాసయొకటియుండె. పాపము వారి కిప్పటిస్థితియో ?

క. జనుఁ డాత్మలాభయోజన
మును విడికొని యెన్ని కష్ట • ములనయిన బడం

జనుఁగాని, సర్వనాశమ
యిన పిదపంగల్గు వంత • లెన్నఁగఁదరమే.

ఇంతియేగాక.........

తే. గీ. దుష్టుఁడయిన దుర్మదుఁడైన • దొంగయైనఁ
దనదుపాప్రిప్తంబనుభవించు • దాఁక భువిని,
నాగ్రహంబున కెఱియగు • నంతపైనఁ
జాలిగొల్పునాతని వంత • సజ్జనులకు.

గోవిందా! ఈ సైన్యాలయములఁ జూడుము.

చ. కరినికరంబు సైంధవ ని
కాయము భాసురకేత నాళిచేఁ
గరమలరారు తేరులును
గాల్బలురుంగను నిండియుండు నీ
పరిసరమెల్ల రిత్తయయి
పాడుశ్మశానమురీతి, జంతు సం
చరణము తగ్గి, గబ్బిలపు
సంఘము పాలయిపోయె నక్కటా.

ఆహా! ఇవన్నియుఁ దత్తదుచిత సైన్యాంగంబులతో నిండి యుండినప్పుడు చూచుటకెంత సొంపుగనుండెనో గదా! ఈ సర్వ నాశంబునకంతకు నేనే మూలంబని చింతింప నా మన

సొంతయుఁ దత్తరిల్లుచున్నది.

కృష్ణ—ఇదేమి ? ఇట్లు మాటాడుచున్నావు ధర్మజా! మనమింత కష్టించి యుద్ధముఁజేసి గెలిచిన తర్వాత నీ విట్లు పశ్చాత్తాపపడిన నెట్లు ? యుద్ధముఁజేసిన తర్వాత నేరికో యొకరికి నష్టము గలిగి తీఱవలెనుగాని రెండు పక్షముల వారును గెలుచుట సంభవింపదుగదా ? దైవకృపచే జయము మనకుఁ వచ్చినది. వారి కర్మానుసరణిఁ బరాజయము వారికిఁ బోయినది.

భీమ—మన కా యోడ్పాటు గలిగిన యెడలవారలు మనలఁ గూర్చితమరందు కరుణములో సహస్రాంశమైనఁ బొందియుందురా ?

ధర్మ—ఏమో! నాకీయుద్ధముఁజూచినకొలఁదితలనొప్పి వైచుచున్నది. కృష్ణా! వివాదాంశము కలిగినప్పుడెల్ల యుద్ధములు చేసి, ప్రజాక్షయంబొనర్చి, లోకంబునకుఁ గీడుదెచ్చుట మాని, యేరైన నల్వురు పెద్దలు చెప్పినట్లొప్పుకొనుట మేలిమార్గమని తోఁచుటలేదా?

అర్జు—అట్టివిధమునకు నినుబోటి ధర్మాత్ములొప్పుకొందురు కాని యీప్రపంచమునంతట నిండియున్న స్వలాభాపేక్షులును, నీర్ష్యాపరులును, నొప్పుకొందురా ?

నకు—అన్నా ! ఒకవేళ నీవన్నట్లు మనము యుద్ధముల

మానితిమేని మన దేహపటుత్వంబును, పౌరుష ధైర్యంబు లును దగ్గి, ఇంక నేరైనం బరదేశీయులు మనపైకివచ్చినచో నబలలవలె వారికి లొంగవలయునంత స్థితికి వత్తుమేమో?

ధర్మ—ఆ! ఏల? ఒకదేశపు జనులు యుద్ధముల మాని సౌఖ్యముండుట పెఱవారు చూచి లేని వారుకూడనట్లు వర్తిల్లుదురు. అట్లు క్రమముగఁ బ్రపంచమం దంతటను శాంతియ ప్రవర్తిల్లు.

సహ—అగ్రజా! యుద్ధాదులులేక భూమిపై జను లందఱు పుట్టినవారందఱు పెరిగి సంతానము వడయుచున్నఁ గొలఁదికాలముననే జనసంఖ్య పలుసారులు గుణితంబై, ధరా దేవి భరింపనలవిగానిదగును.

కృష్ణ—ఓహో! నాకందఱు బృహస్పతులవంటి బావలు దొరకినారు. మేలు. మేలు. నీతజ్ఞులు చెప్పినప్రతి వాక్యములో యథార్థ న్యాయము విశేషముగఁ గలదు. మఱియు సమీకాది విఘ్నములవలనయున్న ప్రకృతులున్న ట్లుండి మాంద్యదోషమునకు లోఁగాక, తఱచు మార్పులు గలుగుచుండును. అదియుంగాక నొకరికంటె నొకరతి శయించియుండవలయునను కోర్కెయే లేకున్నచో నభివృద్ధిగ లుగునెట్లు?

ధర్మ—ఏమో! మాధవా! ఒకరిగొంతులొకరు తెగ నఱుకుటలోఁదప్ప, యభివృద్ధిచెందుటకు వేఱుమార్గములేలేవా!

పోనిండు మీకందఱకు వ్యతిరేకముగ నేవాడ నేల! కాని మన మూలమునఁ బాడువడియున్న యీస్థలముల........

భీము—మనమూలమున నేల? వారిమూలముననే

ధర్మ—సరి. ఏరివలననో యొకరివలనఁ బాడయిన యీస్థలములఁ జూచుకొలఁది నాకు దుఃఖం బధికంబగుచున్నది. కాన నిఁక నే నిందుండజాల. ఇఁక నీ దుఃఖభరంబున మన శిబిరంబులకుఁగూడఁ బో నిచ్చ లేకున్నది. ఏది యయిన నొక నదీతీరంబున నీరాత్రియుండి రేపు చేయఁదగినవి చేయఁ వచ్చును. కాని మాధవా! దయయుంచి నీ వింతలో కరిపురంబునకరిగి......

కృష్ణు—ఆ! అరిగి యేమి చేయవలెను?

ధర్మ—గాంధారీ ధృతరాష్ట్రుల దర్శించి... ...

కృష్ణు—పని చేయునదంతయు మీరు, నను మంతురసాని తనముననా కా?

ధర్మ—బావా! నీకేపని యుత్కృష్టమగును? నీ వన్నిఁటికి సమర్థుండవే! నాయందు దయయుంచి యీ పని మాత్రము చేయుము.

ఉ. అంధుఁడు పెద్దవాఁడు మన
కందఱకుం గడు వందనీయుఁడుఁ
బంధువు లాత్మజాతులును
బాండవకోప మహానలంబులో

నింధన జాలమై రనుచు
నేడ్చుచు, బొక్కుచునుండు పాప మా
యంధుని దుఃఖతాప భర
మార్పెడు మాటలు గొన్ని పల్కవే.

మఱియును

ఉ. వారక యంధ భర్తవలె
వర్తిల నంధతఁ దెచ్చుకొన్న గాం
ధారి తనూజు లందఱును
దల్లడమందుచు నేంచి దుఃఖసం
పూరితగర్భయై తనదు
పుత్త్రులఁజంపిన క్రూరులందు, మ
మ్మారసి యెంత కోపవతి
యయ్యెనో ! యేమని యెంచుచుండునో.

వారలలోఁ బెక్కువారల వధించినమనభీముని విజయునినేమని శపించునో, నీవేగి యామె కోపంబు చల్లార్పవలెను.

కృష్ణ—రానున్నదంతయు మొదట నా తలపైఁ బడుటకా ?

ధర్మ—తలపైఁ బడినను వహింప శక్తిఁ గలవాఁడవు నీవే. ఆ పరమపతివ్రత యమోఘవాక్కుఁ గలది కావున మొదట నామె నెదుర్కొన నాకంత కుతూహలముగ లేదు. బావా ! అనుగ్రహించి యియ్యకొనుము.

అర్జు—అన్నా! మొదటినుండియు మనపాలిఁటి దైవ మయిన బావ యీమాత్రపుఁబని కియ్యకొనుటకు సందేహ మేమున్నది ?

ధర్మ—అట్టి సందేహ మెప్పటికిని లేదు. మాధవా! మేమేగి యోఘవతీనదీ తీరమున విడిసియుందుము. నీవు మమ్మందఱఁ గలిసికొని పెద్దయ్యకోపముఁ బాపితినని చెప్పుము.

కృష్ణ—ఇది యన్నిఁటికంటె బాగుగనున్నది. ఆవుఁబు నాఁపులు కలహించి లేఁగల కాళ్ళు విఱుగఁ దొక్కినటుల మీ యవిరామ పోరాటము నడుమ నన్నిరికింపఁ జూచెదరు. ఇఁక సరి. పోదమురండు.

(నిష్క్రమింతురు.)



# తృతీయాంకము.

## మూఁడవ రంగము.

(పాండవశిబిర పరిసరారణ్య ప్రదేశము.)

(ప్రవేశము___ఆలోచనాపరుఁడై అశ్వత్థామ, కృపుఁడును.
కృతవర్మయు, నిద్రించుచు)

మంజరి___ద్విపద.

అశ్వ- ఆహా ! వీరిద్దఱ ♦ కతినిద్రయెంత
సులభంబుగాఁ బట్టె, ♦ సుఖముగా ధరణి
పడి, గుఱ్ఱుపెట్టె, యీ ♦ పాపంపు భువిని
గలుగువంతలను చీఁ ♦ కఁటిఁ ద్రోచి మఱచి
నిద్రించుచున్నారు ♦ నిజము నావలెనె
వాగ్దత్తవిధమును ♦ వడిగఁ జెల్లించు
కోరిక మది రవుల్ ♦ కొనుచువారలను
బాధించుచున్నదా ? ♦ ప్రతిన ! హా ! ప్రతిన !

ఋణమింతలోఁగడు ♦ వృద్ధినిబొంది
తనుగొన్న మనుజుని ♦ ధనమంతమ్రింగి,
బిచ్చవానిగఁజేయు ♦ విధముగఁ బ్రతిన
కూడఁ దన్నెవఁడైనఁ ♦ గోపకాలమున
బూనిన, నాపైని ♦ పూన్కి చెల్లింపఁ
గలనో, లేనోయటన్న ♦ కష్టచింతనము
మదిఁజొన్పి ; వ్యతిరేక ♦ మయిన యూహలను
బోరులాడించి, స ♦ ద్భక్తిపోకార్చి,
వడి ధీయుతునిబిచ్చి ♦ వానిగాఁజేయు.
నేనారయఁగ నిప్పు ♦ డీగతినుంటి.
నని దేవతలనైన ♦ నణపంగఁజాలు
పరిబలులైనట్టియా ♦ పాండు నందనుల
సర్వ బాంధులఁబోడ ♦ నమయించి మించి
భూమి నపాండవం ♦ బుగఁ జేతునంచు
రారాజునకుఁ నాతు ♦ రత మీఱఁ జెప్పి
చేయుమార్గములేక ♦ చింతిలుచుంటి ?
నకట లెన్నరయక ♦ యతికష్టమైన
పనిఁ జేతునంచు నేఁ ♦ బల్కంగఁ దగునె?
పోని ! యైనదియయ్యెఁ ♦ బూర్తిగానాకుఁ
బాండుసూనులపైని ♦ పగయెందుగలదు.
కాని యూపగదీర్చు ♦ కరణి యెట్టులనో ?

వారిలోఁ గుఱ్ఱఁడో ♦ పార్థ నందనుఁడు
పులిమేఁక గుంపులఁ ♦ బోఁద్రోలునటులు
నానాడు మమ్మెల్ల ♦ నడలించియుండ
నభిమన్యుతండ్రియౌ ♦ నర్జునుఁడాది
బలువురు బలులున్న ♦ పాండు వీరులను
జంప మువ్వురికిప్డు ♦ సాధ్యమౌనొక్కొ ?

(దేనినో చూచుట నభినయించి)

ఓహోహో ! ఇదియేమి ? ♦ యురు భీకరముగఁ
దలయంత కనుగ్రుడ్లు ♦ దనర భూతంబు
వలెనొక్క ఘూకంబు ♦ వచ్చి యీవృక్ష
ఘనశాఖ నిద్రించు ♦ కాకిమూఁకలను
వాడిగోళులచేత ♦ వరుసఁ జీల్చుచును,
కరుణ యింతయులేక ♦ కావుకావనెడు
పిల్లలరక్తంబు ♦ పీల్చిచంపుచును,
నాశంబొనర్చుచు ♦ న్నది క్రూరరీతి.
వారించి దానినా ♦ వలకుఁ దోలుదునె ?

(కొంచెము నడచి)

ఏల ? నాకేల ? య ♦ దేమి చేసినను

ఘూకంబు తన యిచ్చ ♦ కొలఁది వర్తింప
మాన్ప నా కేవని ? ♦ మనుజులయందు,
నొకని నొక్కఁడు చంపి ♦ యుప్పొంగురీతి
పక్షులందునఁగూడఁ ♦ బ్రబలుగాఁబోలు
కాని యీ ఘూకంబు ♦ కరణిఁ జూడంగ
ప్రతినదీర్పఁగ మేలి ♦ భంగిదోఁచెడిని
నీతిగాదందునా ? ♦ నీతియుగీతి
వలయునేరికి ? తన ♦ వాంఛఁ దీర్చుటకు
జనుఁ డెట్టులైనను ♦ సమకట్టునందుఁ
గసితీర్చుధన్యత ♦ గలిగినమేలె !
కాకున్న మృతిపైన ♦ గలుగు చీఁకటిని
నేమియున్నదొ కాక ♦ యెవ్వం డెఱుంగు ;
రాత్రి చాలఁగనయ్యె ♦ రయముగవీరి
లేపి, దోచినయట్టి ♦ లీలఁ దెల్పెదను.

(లేపును.)

కృపు—ద్రోణాత్మజా ! నీ వింకను నిద్రింపకుంటివేల?

కృత—అబ్బ ! పగలంతయుపోరి డస్సి యుంటిమి. ఇఁక గొంచెము సేపు నిద్రింపనీయఁగూడదా ?

అశ్వ—లెండు. లెండు. చావనైయున్న కౌరవేశ్వరు

నాజ్ఞతీర్పవలసియుండ నిప్పుడా నిద్రించుట ! దానికి తర్వాత నెంతయు వ్యవధిగలదు.

కృపు—ఇప్పు డీయర్థరాత్రిందువ నేమిచేయఁగలము? ఉదయమునఁగదా నేదియయినఁబని ?

అశ్వ—ఉదయమునసైన నేమి చేయుదమని నీ యభిప్రాయము ?

కృపు—చేయుట కేమున్నది ? మరణవేదనలోఁ గురురాజన్నమాటలఁబట్టి నీ వసాధ్యమగు ప్రతినఁ జేసియుంటివి. అదియుఁగాక పాండవులపై నీర్ష్యాభావము నీకున్నట్లు నాకుఁ దోఁచెడి. ఏదియెట్లున్నను నేఁ జెప్పునది వినుము. మనముసలిరాజు ధృతరాష్ట్రుండింక నున్నాఁడు గదా ? రేపాయన కడకేగి, యాయన యుత్తరువు ప్రకారము చేయవచ్చును.

కృత—నాకది మంచిమార్గముగ దోఁచుచున్నది.

అశ్వ—తుద కదియా నీ యాలోచనము. మీరిద్దఱు పాండవుల పంచఁ బ్రతుకఁగోరి వారల కెగ్గు సేయనొల్లక యిట్లాడుచుంటిరా ? నిజముగా భయమందుచుంటిరా ?

కృత—కాని, ద్రోణాత్మజా ! మమ్మిప్పుడేల మేలొకొలిపితివి ?

అశ్వ— రాజకార్యమున నీపాటి శ్రద్ధగల మిమ్ము

మేల్కొల్పుటయేనాతప్పు. కాని యడిగితిరిగాన, జెప్పెద
వినుండు.

తే. గీ. భీకరంబగు మిడిగుడ్లు • పెద్దవైన
వాడిగోళుల తోడుత • వచ్చి, వృక్ష
శాఖనిదురించు కాక సం • చయమునెల్ల
ఘోరవధ మొనర్చినయొక్క • గూబగంటి.

ఉ. ఆరసిపాండుపక్ష జను
లందఱు నిద్దురపోవుచుండ, నా
ఘోరఖగంబు కాకముల
గూల్చిన సౌప్తికకాలమందునన్
వారలకంఠరక్తపరి
వాహజలంబుల నాగ్రహానలం
బారిచి కౌరవేశునకు
నాత్మహితంబిడ నిశ్చయించితిన్.

కృపు—అయ్యయో! ఇదియేమి? నే సరిగా విను
చుంటినా? నిదురించువారల గొంతులు గోయుటయా?

కృత—ఎన్నడును నెఱుగని యిట్టి పాపమా?

అశ్వ—క్రూరులకుదగు శిక్ష యొనర్చుటలో బాప
మేమున్నది? మఱియు మన మొనర్పనున్నది వారికి మనో

భీత్యాదిబాధలులేకుండ జరుగునుగావున, నంతటి సుఖమర ణాము వారికిచ్చినందులకు మనకుఁ బుణ్యమేకాని పాపము లేదు.

మ. భయముం జెందకుఁడయ్య కౌరవనృప
ప్రారబ్ధభారంబునం
జయమా శత్రునృపాళిదై యతని దో
స్సామంతులందెల్ల నీ
త్రియమే నిగ్గితిమందు నాతని మన
స్తాపంబు వారింప నీ
ట్వ్యయమెంతే వెనుదీయ, నే సుకఁడనే
దర్పంబు వాటింపనే.

కృత—మేము భయమందువిషయ మటుండనిమ్ము. గాని అశ్వత్థామా! అదియేమిపని. ఈ చెప్పరాని పాపకార్యం బొనర్చి కౌరవుల, నిఁక వచ్చుకాలంబు లన్నింట నపకీర్తిపాలు సేయఁ జూచెదవా ?

కృపు—అయ్యో ! కుమారా! ఏరైనను గత్తిఁబట్టిన తర్వాత ధర్మయుద్ధముచేయవలయు. మఱియునందుఁ బ్రాహ్మ ణుండు సంగరమునకు సమకట్టునప్పుడు నితరు లనుకరింప

దృష్టాంతమై యుండవలెనుగాని, పాపభూయిష్టంబై యుండిన నెట్లు ?

అశ్వ—ఓహో ! దోషములన్నియుఁ గౌరవులవే ! కౌరవులే దుష్టులు ! పాండవులుమాత్రము సజ్జనులు ! మీకుఁ దగిన ప్రసంగనగలవారు! చాలుచాలు నీమాటలు. మీరిద్దఱు పిరికిపందలై యుండుఁగూర్చున్నను నేఁ జెప్పినది చేసియే తీరువాఁడ ; నన్నెవరాపెదరో చూచెదఁగాక !

(లేచును.)

కృత—(లేచి) అశ్వత్థామా ! హిత మెంత చెప్పినను వినక నీవు మమ్మునిష్కారణముగా భీరులనితిట్టితివి. ఈనాడు నీవు చెప్పినట్లుఁబోర గురురాజునకు వాగ్దానమిచ్చియుంటినిగాన నేమైనను సరియే ! వచ్చెదను. నన్ని దుశ్చేష్టితకుఁ బురికొల్పిన పాపంబంతయు నీ తలపై నేఁ బడుఁగాక ! కృపాచార్యా ! లెమ్ము. ఇంకేల నాలసించెదు ?

కృపు—అతఁడేమన్నను నాకీ పాపమొనర్ప నిచ్ఛలేదు.

అశ్వ—రథికవరులారా ! నేనొకటి చెప్పెదవినుండు, శిబిరంబులోనికి నేనుబోయి, ధృష్టద్యుమ్నాదిఖలుల ఖండించెద. మీరు శిబిరద్వారముకడ నిలిచి, పారివచ్చువారి నటకూఁడు. అందుచే నిద్రించువారి నఱుకుట మీకుఁ దప్పును.

కృపు—ఐనను నాకీ దుష్కార్యముపైఁ గోర్కెలేదు.

అశ్వ—నీవంటి వా రుండుటచే కౌరవులకుఁ బరా

జయము గల్గినది.

ఉ. అన్నము పెట్టిప్రోచిన మ
　　హాత్మునికార్యము చుల్కఁజేసి, గ
రోన్నతమత్తులౌ నరుల
　　నొద్దిక నెంగిలి కూటినుండు సం
పన్నతఁ గోరు నీ పిఱికి
　　పందలకెల్లు రుచించు సాహసో
త్పన్నతరీతి ? నే నొకఁడ
　　దుష్టుల నే హరియింపఁ బోయెదన్.

కృపు—ఆ ? ఏమీ ! ఏమీ ! నీ పిఱికివాఁడవే మగవాఁడనా ! నీపిఱికురుఁడవే స్వామికార్య తత్పరుఁడవా ! మే మందఱము కృతఘ్నులమే! తత్కాలాలోచనాధిక భీరులమే! మన బంధుత్వమెంచి, నీమాటల సహించితి. సరియే! మేమును నీ వెంటవచ్చెదము. ఈఘోరపాపభరంబు నీపైనే పడుఁగాక!

అశ్వ—(నవ్వి) ఆహా ! యిప్పుడు నాకు మీరు మును పటి పరమ మిత్రులైతిరి.

కృపు—కార్యమాలోచింపుము. నాకోసము తగ్గనేని యీాయసహ్యకార్యంబునకు మఱలవెనుకాడుదునేమో ?

అశ్వ—అట్లయినరండు. ఇదియే పాండు శిబిరము.

(మువ్వురు చెంత కేగుదురు. ఒకభూతము కానిపించును.)

కృత—ఇదియేమి వికృతాకారము ?

కృపు—మనము చేయఁబోవనున్న దానికిఁ దగినట్లే యున్నదీభూతము.

అశ్వ— మిత్రులారా ! సందేహింపకుఁడీ. మహిత కార్యముల కాటంకముండుట సహజమే. నీభూతము నే నిదే పాఱఁద్రోలెద.

(బాణము వేయును. భూతము నిశ్చలమై యుండును.)

అక్కటా ! నాబాణము నీభూతమట్లే దిగ మ్రింగినది. ఇంకొకటి ప్రయోగింతుఁగాక ! (అట్లు చేయును.)

ఇదియు మునుపటి దానివలెనే వ్యర్థమైనదిగదా. శక్తిం బ్రయోగించిచూచెదఁగాక. (అట్లు చేయును.)

అరెరే ! శక్తియు నిరర్థకమైపోయినది. ఏమి యాశ్చర్యము ! దీని నతిక్రమించు వెఱవెట్లు ?

కృత—ఏమి ద్రోణనందనా ! ఈ తుచ్ఛభూతంబునే జయింపలేకున్నఁ బాండుపుత్త్రుల నెట్లుసంహరింపఁగలుగుదువు?

అశ్వ—(వినిపించుకొనక) కత్తితోఁ బోరెదగాక ! (అట్లు చేసి) ఎక్కడి యద్భుతమిది ? కత్తి పొగలోవలె నష్టు లేకపోయినను, భూతంబు చలింపదయ్యె. ఏమొనర్తును. నా యత్నము లన్నియు వ్యర్థములై పోయినవి. నా కేమి యుఁ

వోచుటలేదు. ఓ పరమేశ్వరా !

శా. శ్రీగౌరీశ ! మహేశ ! యాశ్రితజన
శ్రేయోభిలాషా ! శివా !
నాగాలంకృతదేహ ! సర్వసుజ నా
నందప్రదా ! విశ్రుత
ప్రాగాణాముల రౌప్యపర్వత ! మహా
పద్బాంధవా ! దేవదే
వా ! గర్వాంధవిదారణా ! వృషభరా
డ్వాహా ! త్రిలోకాంతకా !

సీ. శాంతమొల్కెడు నెన్నొ • సలిభూతినడుమను,
లోకంబులనుఁ గాల్చు • భీకరాగ్ని
పురుషవతంసుని • వర శరీరంబంటి
కామినీతనులతా • కోమలంబు
నల వెండికొండపై • నావాసముండి శ్మ
శాన సంచారణా • చారరీతి
భక్తాళి సంపదు • ద్భవకారణుఁడవయ్యు
తలపుర్రెలో భిక్ష • వలసియుంట
తే. గీ. లాదిగాఁగలచిత్ర చ • ర్యలను గలిగి
సూరిజనుల కక్షేయమా • భూరి సుప్ర

భావ ! యాశ్రితసులభ ! యో ♦ పరమపురుష !
భూరికరుణ నన్నిప్పుడు ♦ బ్రోవరావె!

శా. లోకానీకము పుట్టఁజేయఁ బెనుపన్
లోపంబుఁగావింప, మూఁ
డాకారంబుల నిర్వహింతురఁట! నీ
వక్షుణ్ణమూర్తిలోఁ బూరుషా
ఖ్యాకంబౌ వారణంబు సేయుదఁట ! నీ
యత్నేనునుంజేయ భూ
తాకారంబిది యద్దునిల్చెఁ గడువం
దర్పంబు నా కీగదే.

ఓత్రిపురాంతకా ! ఇంకను బ్రిసన్నుఁడవుకావా !

ఉ. ఈ పెనుభూతముం బఱపి
యే నరి సంఘముఁగూల్చు మార్గముం
జూపడఁజేయకున్న నిదె
చొచ్చెద నే ననలంబు ; లేక సం
తాపముతోడఁ గత్తిఁ బడి
తన్వు దొఱంగెద—

(కత్తిపైఁ బడఁబోవును.)

(భూతాకారము మాఱి శివుఁడగును.)

శివు— ,, ,, ,, ఆఁగుమాఁగుమే
నీ పటిమంబు మెచ్చితిని
నీ మదికోర్కెలు దీర్పవచ్చితిన్.

ఏమీ! అశ్వత్థామా! నీ పౌరుషంబుఁ బరీక్షింప నేన యీ భూతాకారంబున ని న్నెదుర్కొంటిని. నీ ధైర్యముంజూచి మెచ్చి యిదే, నీకీ కత్తి నిచ్చుచున్నాఁడ. (కత్తి నిచ్చి) నీ వీఁక శత్రుమారణంబొనర్పఁగలుగుదువు. పాంచాల ద్రౌపదేయులకు నేఁ డాయుఃపరిసమాప్తి యయినది.

అశ్వ—మహేశా! నీ దయ నెట్లు కొనియాడఁగలుగుదును?

శివు— నే నిదే యంతర్ధానుండ నగుచున్నాఁడ. నీ కార్యము నీఁకఁ జక్కఁ బెట్టుకొనుము.

(నిష్క్రమించును

అశ్వ—ఆహా! ఇది యంతయు నిప్పుడు నా కన్ను యెదుటనే జరిగెనా? పరమేశ్వరుఁడు నిజముగ నా కపడెనా? లేక నే భ్రమించుచుంటినా? మునుపటి సందేహమంతయుఁబోయి, కౌరవేశ్వరునాజ్ఞ ముక్కోటిదేవతలడ్డమైన నెఱవేర్పఁగలుగుదునను నమ్మక మొకటి గలిగినది. ఇదిమాకే

శ్వరుని కరుణాకటాక్షాలు ! కృతవర్మా! కృపాచార్యా ఇంకను వెనుకాడెదరా ?

కృపు —ఇప్పుడు చూచిన దంతయు నా యొడలు కంపింపఁ జేయుచున్నది. నేనిఁక నీవాఁడనే.

కృత — పరమేశ్వరు సాహాయ్యముఁ బడసిన నీకు మాతోడాక దుర్ఘటమా ?

అశ్వ —ఇప్పుడు నాకు సంతోషమయ్యె. మనము వ్వళ మేగి,

సీ. ఖండించెదము దుష్ట ♦ పాండువీరులతలల్
మొండెంబులను వీడి ♦ తాండవింప
నఱకెద, మన్నికా ♦ ల్వరులగుంపులఁబడి
యఱదివారలు భీతి ♦ పరువులిడఁగ
ద్రోసెద మఖిలాశ్వ ♦ కుల కేశవాలముల్
గాసితన్నుచునశ్వ ♦ యోసరిల్ల
చంపెదమేనుఁగు ♦ గుంపుల తొండముల్
చెంపలు కుంభముల్ ♦ రొంపిఁగలయ
తే. గీ. ద్రౌపదీసోదరుని ఛిత్రి ♦ రౌద్రి మెసఁగ
వధమొనర్చి పాంచాలుర ♦ వమ్ముఁజేసి
మనల నింతఁజేసిన వారి ♦ మట్టిఁ గలిపి
రయముగాఁ గోర్కెఁదీర్తుము ♦ రండు రండు.

కృపు—అశ్వత్థామా, నీవీనాడు మాకు నధికారివి. ఎట్లు బోరవలెను ?

అశ్వ—మాతులా! ఈముప్వురిలోనొకనిపైనొకఁడధికారియగు టెందులకు ? లెక్కకు మీఱినసైన్యముల నొక్కయుద్దేశ పర్యవసానంబునకై నడిపింపసైన్యాధికారిగాని, యీముప్వురును నేరికిఁ దోచిన తెఱంగున వారు పోరవలసినదే. మఱియు మీరు మహారథులు, యోధవరులు, మీకు నేఁ జెప్పువాఁడనే! ఐనను మొదట మీరు ద్వారము గాపాడుచుండుఁడు. నేను లోనికిఁ బోవుదును.

కృపు—నీ యిష్టమైనట్లే.

అశ్వ—అట్లయినరండు. ఇదే పాండుశిబిరము. (వినుట నభినయించి) లోపలనంతయు నిశ్శబ్దముగనున్నది. మనకిదియే మంచి సమయము. నే నేగెద. ఏల యట్లు చూచెదరు ?

కృపు—ఏమో ! ఒక్కఁడవు పాండుసైన్యమంతటిపై కేగుచున్నావు.

అశ్వ—మనకు శైవ సాహాయ్య ముండగ నేటి యాందోళనము ?

కృత—అక్కడ వారికిఁ గృష్ణ సాహాయ్యము లేదా

అశ్వ—ఏటికీ రిత్త భయము. రండు. ఈద్వారముక నిల్వుఁడు. నే నదే యా వెనుకటి మార్గమున లోఁ బ్రొ

శించెద. (పోవుచు వెనుకకు దిరిగి) వీరులారా! క్షమాపణ నేరికి నీయవలదు సుండీ! వచ్చినవారలు వచ్చినట్లే యమపురి కంపవలెను.

(నిష్క్రమింతురు)

కృపు—నేఁడెట్టి వింతలఁజూచితిమి? నాకిది యేదియో కల్పాంతదినమువలెఁ గన్పట్టుచున్నది.

కృత—ఇంక ముందెన్ని వింతలుజరుగునోచూడుము. మన యశ్వత్థామ తనప్రతిజ్ఞతీర్చుననియే నీయభిప్రాయమా?

కృపు—ఎక్కడి మాటలు? పాండు వీరులముందీ యాటలా? హనుమంతునిముందు కుప్పిగంతులా?

కృత—ఏది యెట్లున్నను మన పని ప్రారంభింతము. ఇదిగో యిక్కడెవ్వరోయిద్దఱు నేలపైఁబొరలిపడియున్నారు. మొదట వీరిపని గానిచ్చెదము.

కృత—అబ్బ! వీరియొద్దనుండి కల్లుకంపెంత కలుషముగా వచ్చుచున్నది. (కాలితోఁ దన్ని లేపును.)

(ప్రవేశము—భూతభీరుఁడు; లంబపాదుఁడు.)

భూత—(లేచి) అమ్మయ్యో! దయ్యము.

లంబ—(గడగడ వణకును.)

కృత—అఱవకుము. నో రెత్తిన నాల్కఁ జీల్చెదను.

లంబ—ఓరీ ! తమ్ముఁడా ! నో రెత్త కర్రా ! నాలికె తీస్తారంటా ! అప్పుడు పుల్బు కల్లు రుచి యెట్లా తెలుస్తది ?

కృపు—ఓరీ ! పంచపాండవు లెందున్నారు ?

భూత—అయ్యో ! సెప్తే యేంతంటో ? చెప్పకుంటేం తంటో ?

కృపు—అట్లయిన నిన్నిదే పొడిచెదనా ?

లంబ—ప్రారయ్యా ! సంపకండయ్యా ! మే మిద్ద రన్నదమ్ములమయ్యా ! వొక్కఁడే తండ్రికి బుట్టామయ్యా !

కృత—ఓరీ ! అన్నదమ్ములొకప్పుడిద్దఱు తండ్రులకు పుట్టుటకలదా ?

(తెరలో కలకలము.)

శా. ఓరీ ! చావగ సిద్ధమున్న మహితుఁ
యోధాగ్రగణ్యున్ మహా
వీరుం డట్టుల గొంతుఁ గోసితివి యా
వీరత్వమే దిప్పుడే
నీరక్తంబులనాదు తండ్రికిదివిఁ
నిండైన మోదంబిడఁ
గారంజేసెదఁ బిండతోయములు గాఁ
గార్యంబు వాటింపుమీ !

కృపు—అదుగో! యశ్వత్థామ ధృష్టద్యుమ్నుని శిబిరంబు ప్రవేశించి యాతని సంహారింపఁ బోవుచున్నాఁడు.

[తెరలో]

ఉ. భీరుఁడవై రణస్థలిని
భీకరమత్పటుశౌర్య మోర్వకే
పోరుచాల డస్సి శర
పుంజము వీడియు నిద్రసేయుచో
క్రూరుఁడవీవు దొంగవలెఁ
గొంచెము సిగ్గునులేక యిట్లు నన్
మారణ సేయఁగాఁ దగునె
మానుషమింతయు లేని కైవడిన్.

కృత—ఓహో! ధృష్టద్యుమ్నం డెంత పౌరుషముగ నుత్తరు వొసంగినాఁడు?

[తెరలో]

చచ్చె. చచ్చె. (ఏడ్పులు. శబ్దము.)

కృపు—ఇదుగో! యెవ్వరో పాఱివచ్చుచున్నారు. ధృష్టద్యుమ్నుఁడు చావగావాని భటులైయుండనోపు. పోనీయక యిక్కడనే పడనుఱుకుదము.

భూత—వ్రూరన్నా! ఇదిసూస్తే నాకు భయమౌ.
తుండాది.

లంబ—మాటాడక. ఇదే సందు. కాలికి బుద్ధి చెప్తాం.

కృత—ఓరీ! ఇదియ యదనని పాఱుజూచెదరా!
ఇదే పోండు. యమపురికి. (చంపును.)

(లోనుండి జనులు వత్తురు.)

కృపు—నీచులారా! కౌరవసింహములివే మిమ్మరి
కట్టుచున్నవి. (పొడుచును.)

జనులు—ఇక్కడకూ... ...డుందురో బాబోయని—
(కలకలము.)

(చావ మిగిలినవారు వెనుకకు పారిపోవుదురు.)

కృత— మనము పూనికొన్న పని కావచ్చునని యే
తోఁచెడి. వీరు కలవరపడి యొకరినొకరు బొడిచికొందురు.

కృపు—పాండవులేరి చెపుమా!

[తెరలో]

దయ్యము, రాక్షసుఁడు, దొంగ, (అను కేకలు)

ఓరీ! యుధామన్యా! నీకిదే కడపటిరాత్రి. (ఘోర కలకలము

కృత—యుధామన్యుఁడుకూడ వధింపఁబడినట్లున్నది

[తెరలో]

అశ్వ—

ఉ. కౌరవబీజ మొండయినఁ

గాంచుటకే ధరసిల్వనీక, మీ

కూరుచు తండ్రులైదుగురు

ఘోరతఁజేసిరి వంశనాశనం

బే, రహి కౌరవేశ్వరుని

యిష్టముఁ దీర్చఁగ పాండునందనాం !

కూరములైన మిమ్ముఁ వడిఁ

గూల్చుచునుంటిని గాచికొండిఁకన్.

అమ్మా! అయ్యా! అన్నా! (అను ధ్వనులు; అల్లరి; కలకలము.)

(కొందఱు జనులు వత్తురు.)

కృత—ఇదిగో! మాటి కొందఱు వచ్చుచున్నారు, పొడువుము.

(చంపుదురు.)

(తెరపడును.)

---

తృతీయాంకము.

నాలుగవ రంగము.

ద్వైపాయనహ్రదతీరము

(నేలఁబడిన్నదుర్యోధనుఁడు; చెంత వనవీరులు; సంజయుఁడు.)

1 వనవీరుఁడు — మన రాజుగారీయనదగ్గిర మమ్మలిని కావలి పెట్టాడు. ఈయనింకా చావలేదేంరా!

సంజ — వనవీరా! ఈతని స్వభావ మెట్టిదయినను, ఈ రా జెట్టివాఁడని తలఁచితివి ?

సీ. సప్తసాగరమధ్య • సర్వవసుంధరా
స్థలమునేకాత ప • త్రిత వహించి
కోటీశరాజన్య • కోటీరమణిపుంజ
రాజితపాదుఁడై • తేజరిల్లి
త్రిదశాతిశయ వీర్య • ధీరాతిధీరాను
జ శతనమూహానం • శ్రియతఁదనరి;
ప్రబల సైనికవార • బహువాహగజయుతా
నేక సైన్యముల న • న్నిధినిగలిగి

తే. గీ. ధరణిదేవేంద్ర వైభవో • ద్ధురత మించి
శౌర్యసంపద సామ్రాజ్య • సౌఖ్యముండి
వీరుఁడౌ నీ నృపతికిట్టి • విధముఁ జేర
కఠినమానసమైనను • గరుఁగకున్నె.

వన — ఎట్లాంటోడయినా చాలా పెద్ద రాజురా! అదుగో కదులుతుండాడురోయి.

దుర్యో — అక్కటా! నేనింక యేలజీవించియున్నాను! నా శరీర మధోభాగమంతయు నలగఁబొడిచినట్లు బాధించుచున్నది. అశ్వత్థామవచ్చి యీ సంతోషవార్త నా చెవుల వేయునేమో యను నాసయే యింతవఱకు బొందిలో నా ప్రాణము లుంచినది.

ఏమో! ఈమువ్వురివలనను, వారికేటి యపాయము రాఁగలదు? ఐనను పాండవులకీనాఁటేదియో గొప్పకీడు వాటిల్లునను నాసమాత్రమున్నది. హా! అదితీరునా! తీరకుండునా! ఏమో!

(ప్రవేశము — అశ్వత్థామాదులు.)

కృప — రారాజింక ప్రాణముతో నున్నాఁడో లేఁడో! అయ్యో! ఏమి ప్రభువింక సజీవుఁడేనా?

సంజ — (అంగీకారముసూపి) రారాజా! అశ్వత్థామా

దులు వచ్చియున్నారు.

దుర్యో—(తలయెత్తి) అశ్వత్థామా! ఏమైనది?

అశ్వ—రాజా! రాజా! పరమేశ్వరు కృపామహిమచే నీయభీష్టము నెఱవేర్పఁగలిగితిని.

సీ. చిత్రింబుగావధఁ • జేసి ధృష్టద్యుమ్ను
పాంచాలుమూకలఁ • బగలఁగోసి
ద్రౌపదేయులఁజంపి • భూపుల నెల్లరఁ
జీల్చి తదనుచర • శ్రేణిఁగూల్చి
మలఁగి సేనల నెల్ల • మట్టించి, యేన్గుల
తొండముల్ దెగవ్రేసి • తురగములను
దోఁకలఁ దెగచి వే • దోలియిందందుల
శిబిరమంతఁ గడింది • సేతనడపి

తే. గీ. కృపుఁడు కృతవర్మయును జేరి • యపరకాల
రుద్రులట్టుల వర్తింప • రౌద్రమెసఁగ
భూమి పాండవాంకూరంబు • బొదలకుండఁ
జేసివచ్చితి నీయాజ్ఞ • శిరసుదాల్చి.

దుర్యో—ద్రోణాత్మజా! నీమాటలు నామదికిమిగుల దియ్యఁగ నున్నవి. కాని నీ చంపినవారి నామములలో పాండుపుత్రులవి లేవేమి?

అశ్వ—రాజా ! నీకది చెప్ప నా కెంతయు సిగ్గగుచున్నది.

ఉ. ఏమయిరో కొ ? పాండుసుతు
లెందున కేగిరో ? గానరారు నే
నా మదనుత్తులం గనుట
కెంతయుఁ గుతిమ్మరి యెంతజూచినన్
భూమిప ! వారలెందయిన
బోయిరో ! కృష్ణుఁడు దాఁచియుంచెనో !
యేమరుగందున్నైన ! నను
నీవనిఁ జేయమిక్కై క్షమింపవే.

దుర్యో—పోనిమ్ము ! విచారింపకుము. విధియట్లుండ మనమేమి చేసెదము ? నీ విప్పుడొనర్చినదానికే నాకుమిగుల సంతోషమైనది. మునుపు కర్ణాదుల నే నెంతగ మన్నించుచుండినను వారలింతమంది శత్రులనొకసారి జంపఁజాలిరా ! నీ పౌరుషమునకు మెచ్చితి. పాండవాంకురము లేకుండఁ జేసితివిగా ! మేలు మేలు ! ఈవార్త వినుటకే మేనఁ బ్రాణములనింతదనుక నిల్పికొంటిని. ఇప్పుడు సర్వము పరిసమాప్తమయినది. రాత్రి తుదముట్టినది. సూర్యోదయము డాసినది. ఇఁక నే సెలవుఁ గైకొనియెద. మీ రిఁక ముందేరిని గొలువనున్నను, దుర్యోధనుఁడు మిమ్ముఁ బ్రేమతో గౌరవించెనను

మాట మాత్రము మఱువకుఁడు.

కృపు—అయ్యయో ! రాజా ! ఎట్టిమాట లీపాపపుఁ జెవులు వినవలసివచ్చెను.

కృత—కౌరవేశ్వరా ! మమ్ము వీడి పోవుచుంటివా?

సంజ—హా ! దుఃఖము ! దుఃఖము !

అశ్వ—మహాత్మా ! నేఁ జేయవలసినది జేసితిని. నీ విఁక వీరస్వర్గమునకేఁగి సౌఖ్యమందుదువు. అక్కడ మా యయ్య ద్రోణుఁ డగుపడెనేని నీ హంతకుఁడగు ధృష్టద్యుమ్ననినీ సుతుఁడశ్వత్థామ చిత్రవధ మొనర్చెనని చెప్పుట మఱవకుము.

దుర్యో—నీయభీష్ట మొనగూర్చెదను. నాకై మీరు వగవకుఁడు. స్వర్గమునమరలఁగలిసికొందము. సెలవు. సెలవు.

(చచ్చును)

కృపు & కృత—రాజా ! నీయనుచరుల వీడిపోతివా! మాతనువు లింక నెంతయు ననర్థకంబులుగానున్నవి.

[illegible]ంజ—నే నీవార్త ధృతరాష్ట్రుని కెట్లువిన్నవింతు?

అశ్వ—(దుఃఖమాఁపికొని) కానున్నది పరిసమాప్తి యయినది. నాకేమియో మనంబుల్లోలకల్లోలమై పిచ్చిపట్టిన ట్లున్నది. నా కిఁక తపోవృత్తి దక్క వేరు శరణంబు లేదు. మన మిఁకఁ బోవుదము. అల్లదే ప్రభాకరుం డుదయించు.

సంజ—ఇది మాత్రము వినిపొందు. లోకరక్షకా!

ఉ. ధారిణి సజ్జనుల్ బ్రిబలి
ధర్మవిధం బెడబాయకుండగాఁ
బోరులమాని సర్వమును
భూరి దయారస మొప్ప శాంత సం
చారముతోడ బంధుజన
సంతతి నాశముచేయు భేదముల్
గూరక సత్యవర్తనుల
కోరికలెల్ల ఫలించుగావుతన్.

సమాప్తము.

చ. కలికితురాయిపాగ తలఁగట్టి
మెయిందగు పీతవస్త్రముం
బొలుపుగఁజుట్టి, నీలనిభ
పూర్ణ తనుద్యుతితోడ, లేఁత న
వ్వలరెడి యాననంబున త
నంతన లోకములెల్లఁ దిప్పు మా
యలయలచిన్నికృష్ణునెడ
సత్యనురాగముతోడఁ గొల్చెదన్.

ఉ. శ్రీహరి పాదపద్మముల
చింతనఁజేసి నుతించి మిత్రి సం
దోహముకోర వారలను
దుష్టియొనర్పఁగ నిట్టినాటకం
బూహకొలంది వ్రాసితిని
ఒప్పునొ నొప్పదొ చెప్పఁజాల నా
సాహసమొడ్డు కెక్కె నిఁక
సందియమేలొకో కృష్ణుఁడుండఁగన్.

శ్రీమతే రామానుజాయనమః